# తక్కువ ధరలో చక్కని ట్రాన్సిస్టర్ రూ.310* మాత్రమే

# కొత్త ఫిలిప్స్ 3-బ్యాండ్ల పయొనీర్




## ఆశించినవన్నీ అందుబాటైన ధరలో

- రెండు షార్ట్ వేవ్ రేంజ్‌లపై విస్తృతమైన బ్యాండ్ స్ప్రెడ్.
- సులభమైన ట్యూనింగ్ కోసం అతి తేలికగా తిరిగే పాయింటర్.
- మూడు స్టెబిలైజింగ్ డయోడ్ల వల్ల బ్యాటరీలు దాదాపుగా అయిపో వచ్చినా హెచ్చు స్టేషన్లను గ్రహిస్తుంది, స్పష్టమైన ధ్వని విస్తుంది. ఇది ఫిలిప్స్ ప్రత్యేకత!
- డేంపింగ్ డయోడ్ వల్ల అతి దగ్గరగా ఉండే స్థానిక స్టేషన్లూ, దూరంగా ఉండే స్టేషన్లూ కూడా అవరోధాలేమీ లేకుండా చక్కగా విన్పిస్తాయి.
- కేవలం 3 స్టాండర్డ్ బ్యాటరీలపై పనిచేస్తుంది.
- దృఢమైన క్యాబినెట్— స్పష్టమైన ధ్వని కోసం తగిన విధంగా రూపొందించబడింది
- *చిల్లరగా అమ్మే గరిష్ట వెల, ఎక్సైజ్ డ్యూటీతో సహా. రాష్ట్ర అమ్మకం పన్ను, ఇతర స్థానిక పన్నులు అదనం.




**సర్వశ్రేష్ఠమైనదానినే మీరు పొందాలని మా వాంఛ.**

# ఫిలిప్స్

CASPR-612-244 TL














# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 – 1972]
శుక్రవారం : 3 8-'79
సిద్ధార్థినామ సం. శ్రావణ శు. దశమి
**సంపుటము 72 : సంచిక 47**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక


**కథలు :**

లాంగ్ లార్డ్స్ ... 14
జాలి ఖరీదు ... 36
భమర పంచకం ... 39

**సీరియల్ కథలు :**

రాగరేఖలు ... 8
పలివి ... 19

**వ్యాసాలు, శీర్షికలు :**

లోకం పోకడ-4, బజారాలం-6, ఉత్తరాలు-7, ధర్మపథం-10, సైకిలాప జూబి-24, సినిమా-26, బొమ్మల మహాభారతం-35, డాక్టర్ సలహాలు-38, సామెతల కథలు-42, ప్రశ్నావళి-44, వారఫలం-46, ఫాలాక్షిని డైరీ-47, హైద్రాబాద్ నోట్‌బుక్-49.

# మీరు కేవలం ఓ బల్బును కొనాలనుకుంటే, ధారాళంగా దేనినైనా కొనండి. కాని మీరు మరింత ప్రకాశవంతమైన కాంతి, చిరకాలపు మన్నికను కొనాలనుకుంటే, హెచ్ఎమ్‌టిని కొనండి



చాలా బల్బులు ప్రకాశవంతమైన కాంతిని మన్నికనూ ఇస్తాయి. కాని మీరు మరింత ప్రకాశవంతమైన కాంతినిస్తూ చిరకాలం మన్నే బల్బు కావాలనుకుంటే, ఒకే ఒక బల్బు ఉంది— హెచ్ఎమ్‌టి।

కాని హెచ్ఎమ్‌టి బల్బులు మరింత ప్రకాశవంతంగా కాంతి నిచ్చేందుకు చిరకాలం మన్నేందుకు కారణం ఏమిటి? ఇతర ఉత్పాదకులకన్నా హెచ్ఎమ్‌టి కొన్ని ప్రత్యేకమైన లాభాలను కలిగివుంది. హెచ్ఎమ్‌టి మాత్రమే తమంతట తామే బల్బు యొక్క అన్ని భాగాలను తయారు చేసే ఏకైక సంస్థ. అందేత ప్రతి దశలోనూ నాణ్యతను అదుపులో ఉంచేందుకు హెచ్ఎమ్‌టికి వీలౌతుందన్న మాట.

ఇంకా హెచ్ఎమ్‌టి వారు బల్బులు తయారుచేయడం ప్రారంభించక ముందే వారు బల్బులు తయారుచేసే యంత్రాలను తయారుచేస్తూ వస్తున్నారు. అందువలన కేవలం సాధారణ బల్బులు కాక విశిష్టమైన ఉన్నత మైన బల్బులు తయారుచేసే సాంకేతిక పరిజ్ఞానపు అధిక్యతను హెచ్ఎమ్‌టి కలిగివుంది.

అంతేకాదు, హెచ్ఎమ్‌టి వారు టంగ్‌స్రామ్ వారి— అంటే ప్రపంచంలో ల్యాంపులు తయారుచేయడంలో అత్యంత అనుభవం కలిగిన ఒకానొక విశిష్ట సంస్థ— అనుభవం, విజ్ఞానం కలిగివున్నారు. ఇది హెచ్ఎమ్‌టి బల్బులకు అంతర్జాతీయ నాణ్యతనిస్తుంది.

ఇంకా హెచ్ఎమ్‌టి వారికి, వారి గడియారాలు, యంత్ర పరికరాలు మరియు ట్రాక్టర్లు తయారుచేయడంలో 25 ఏళ్లుగా సంపాదించిన ఖ్యాతి వుంది. మరి ఆ ఖ్యాతివంతులు వారు, ఓ గాజు ముక్కపై ధ్యానంగా ఒద్దుతున్నారంటే ఏదో వుందన్న మాటే మరి.

ఆ వుంది మరి మరింత ప్రకాశవంతమైన కాంతి చిరకాలపు మన్నిక ఇంకా ఉత్తమమైన నాణ్యత

**hmt**




## హెచ్ఎమ్‌టి బల్బులు - మీ జీవితంలో వెలుగులు

Rediffusion/H/748 TL

# మధ్యంతర ఎన్నికలు తప్పవా!

అవినీతికి అతీతుడే అయినా చివరికి మొరార్జీ గారు ప్రధాన మంత్రి పదవికి (జులై 15న) రాజీనామా యివ్వక తప్పలేదు.

అందరి చేత విదూషకుడుగా బఫూన్ లాంటి ముద్దు పేర్లతో పిలవబడ్డా, రాజకీయ చదరంగంలో 1975 నుంచీ సిద్ధహస్తుడైనట్లు రుజూ చేసుకున్న రాజ్ (కీయ) నారాయణ్ గారు నాడు "ఇందిరమ్మ" పతనానికి నాంది ప్రస్తావన పలికినవాడై— చివరికి ఆమెను రాయ్ బరేలీలో అత్యంతాశ్చర్యకరంగా ['77లో] ఓడించాడు- మళ్లీ ఆరోగ్య మంత్రిగా పదవీచ్యుతుడై, నాటి నుంచీ శపథం పెట్టి

"ఏకైక పెద్దపార్టీ నాయకుణ్ని"



# తాజా 'కాలమ్'

గెడ్డం పెంచుకు తిరుగుతూ— నేడు ప్రధానమంత్రిగా వున్న మొరార్జీ భాయ్ దేశాయ్ గారి పదవీచ్యుతికి దోహదకారి అయినాడు— లోపల్నించి రాజీనామాల శర— పరంపర- వెలుపల నుంచి రాజ్‌నారాయణ్ బెదిరింపు— అనుకోకుండా "దేవరాజ్ అర్సీయం" కారణంగా పరిస్థితులు అనుకూలించి ప్రధాన ప్రతిపక్ష నాయకుడైన వై. బి. చవాన్‌గారి అవిశ్వాస తీర్మానం— వీటన్నింటిని తట్టుకోలేక— జులై 16 న పార్లమెంటు దిగువ సభలో పరాజయం పొందడానికి ముందుగానే, యిష్టం లేకపోయినా- 28 మాసాలుగా భారతప్రధానిగా, కత్తిమీద సాము చేస్తున్న శ్రీ మొరార్జీ గత్యంతరం లేక రాష్ట్రపతికి రాజీనామా లేఖని అందించటంతో- పార్లమెంటు ఉభయ సభలు, అల్లకల్లోలంగా వున్న దేశీయ సమస్యలను వేటినీ చర్చించకుండానే ఆ మర్నాడు జులై 16 న నిరవధికంగా వాయిదా పడ్డాయి.

## పన్నాగాల పరాకాష్ఠ

ప్రత్యక్షంగాను పరోక్షంగాను కూడా



"అంతా చరణ్ కోసమే".

బి.యల్‌డి. సియఫ్‌డీల నాయకులైన చరణ్‌సింగ్, జగ్జీవనరామ్‌లు ప్రధాన మంత్రి పదవి కోసం నిరంతర ఆరాట పోరాటాలు సాగిస్తూండటంతో, అత్యవసరంగా 1977 లో ఐదు పార్టీలు ఏకమై "జనత"గా ఆవిర్భవించి, అప్పటి కొత్త కాంగ్రెసును పాతిపెట్టిన మిశ్రమపార్టీ యీ 28 "మాసాలుగా" దిన దిన గండంనూరేళ్లాయుష్షుగా నేనడుస్తూ చివరికి "మా పార్టీ

* చరణ్ రాజ్‌నారాయణ్‌ల వ్యూహం జులై 16న వెల్లడైంది— శ్రీ రాజ్‌నారాయణ్ జనతా(యస్)గా పేరు పెట్టిన పార్లమెంటరీ గ్రూపుకి చరణ్ సింగ్ గారు నాయకుడై "నన్ను ప్రధాన మంత్రిని చెయ్యండ"ని రాష్ట్రపతిని కోరారు
* జగ్జీవనరామ్ జనతాలోనే వుండి శ్రీ మొరార్జీ స్థానే పార్లమెంటరీ పార్టీకి నాయకుడవ్వాలని ప్రధాని కావాలని ప్రయత్నాలు చేస్తూంటే — జనతా అధ్యక్షుడు చంద్రశేఖర్ గారుకూడా మొరార్జీ స్థానాన్ని కైవసం చేసుకుందామని ప్రయత్నించటంతో సమస్య మరింత జటిలమైంది.
* మొత్తం మీద రెండుకాంగ్రెసులూ కూడా 'మిశ్రమ మంత్రి వర్గా'న్ని యేదోరకంగా తమ చేత పెట్టుకోగల మన్న దీమాతో వున్నారు — బేరాలు జోరుగా ప్రారంభించారు.
* దేశానికి రాష్ట్రపతి అవసరం — ఆయన కేవలం రబ్బరు స్టాంపు కాదన్న వాస్తవం రుజూ అయిన యీ సంక్షుభిత అస్థిరస్థితిలో నుంచి వచ్చే ప్రధాన మంత్రి కేవలం గ్రూపుల బలంమీద ఆధారపడతాడు కనుక- ఆ "కీలుబొమ్మ" ప్రభుత్వం నిలకడ కష్టం. యిప్పుడు కాపోయినా, శీతాకాలం నాటికైనా అత్యంత వ్యయ ప్రయాసలతో కూడిన మధ్యంతర ఎన్నికలు జరుపక తప్పదని జులై 17 నాటి పరిస్థితి సూచిస్తున్నది.
* మొత్తానికి చరణ్ - జగ్జీవనరామ్‌లలో జగ్జీవన్‌కే అవకాశ మెక్కువ అని పొలిటికల్ పండిట్స్ జూలై 17 న అనుకున్నారు...

## లోకం పోకడ

13—7—79 పత్రికపై శ్రీదేవి ముఖచిత్రం ఆకర్షణీయంగా వుంది.

కలర్‌లో ప్రింటయిన అన్నా—చెల్లెలు కథ చిన్న పిల్లలు చదవటానికి చాలా బాగుంది. అంతర్జాతీయ బాలల సంవత్సరములో యిలాంటి కథలు పత్రికలో ప్రచురించడం ఎంతయినా అవసరం.

వూహెన్‌గారి లోకంపోకడ కార్టూన్లు విజ్ఞానదాయకంగా వున్నాయి.

డబ్బీరు ఉదయకుమార్, అశోక్, కె. ప్రవీణా, డి. భవాని (కుర్దారోడ్).

## సామెతల కథలు

13—7—79 ఆంధ్రసచిత్రవారపత్రిక లోని కథలన్నీ చాలా బాగున్నాయి. తెనాలిరామలింగని గుర్రం సామెతల కథ బాగుంది.

జి. అప్పారావు, జి. సీతాకుమారి (ఏటికప్పాక)

*　　*　　*

20.7.79 తేదీగల సంచికలో సామెతల కథలు చెరలో పుట్టిన కృష్ణుణ్ణి వసుదేవుడు ఎత్తుకెళ్ళి ద్వారకలో ఉన్న యశోద పక్కలో ఉంచి, ఆమె పక్కలో ఉన్న ఆడపిల్లని తీసుకొచ్చాడని ప్రచురించారు. ద్వారక అప్పుడు ఎక్కడ ఉంది? కృష్ణుడు రేపల్లెలో పెరిగాడని చదివిన మాబోట్లకిది విస్మయ జనకంగా ఉంది మరి! చిత్తగించవలెను.

కె. పి. బాబు, (హైదరాబాద్)

## కథలు

ముగ్ధమోహన రూపమైన శ్రీదేవిముఖచిత్రంతో వెలువడిన పత్రిక ఆకర్షణీయంగా ఉండి మా మనసులకు ఆనందము కలుగజేసింది.

ఈ వారం అన్నాచెల్లెలు కథ ఒక ప్రత్యేకత అని చెప్పవచ్చు. ఈ విధంగా ప్రతివారం ఏదో ఒక కొత్తదనాన్ని ప్రవేశపెడుతున్న ఎడిటర్‌గారు అభినందనీయులు.




...పాడుకథలూ ముచ్చటగా యున్నాయి. రాగరేఖలు సీరియల్ కొత్తమలుపులు తిరుగుతూ ఉత్సాహాన్ని కలుగజేస్తోంది. ఇదిఒకపాంథశాల ముగింపు మాకు బాధ కలిగించింది.

యు. యు. ఉరుకుందు, కె. వేణుగోపాల్‌సెట్టి, (మ్రిగవూరు)

*　　*　　*

"నా అభిమాన అందాలనటి కుమారి శ్రీదేవి (తేదీ 13—7—79 సంచిక) ఫోటో వన్నెంతో అలరించినది.

మరత్నాలలోని నాలుగు కథలలో శ్రీ ప్రతాప రవిశంకర్ గారి — కథలురాసే భార్య కథ వాస్తవానికి సన్నిహితమైతే, శ్రీమతి టి. రుక్మిణీలక్ష్మి గారి ది క్రైమ్ స్టోరీ మిస్టరీ ఫక్కీలో ఆకర్షితమైంది!! మీకు మా అభినందనలు తెలియజేస్తున్నాము !!

పి. ఎస్. లక్ష్మీమోహన్ (సికింద్రాబాద్)

*　　*　　*

మా 13—7—79 తేదీ (ఆంధ్రసచిత్రవార పత్రిక) వారపత్రికలో. వెలువడిన శ్రీ ప్రతాపరవి శంకర్‌గారి కథలురాసే భార్య కథానిక నన్ను ఎంతో ఆకట్టుకుంది. అనుమానమే పెనుభూతం అన్న పెద్దల నుడి విస్మరించి అనవసరముగా తమ శ్రీమతుల శీలమును శంకించి వారిని బాధపెట్టే పెద్దమనుషుల కిది చక్కని గుణపాఠం.

మండవిల్లిహనుమంతరావు (గుంటూరు)

*　　*　　*

29.6.79 న వెలువడిన ఆంధ్రసచిత్రవార పత్రికలో పిచ్చి నమ్మకాలు కలవాళ్ళకు కనువిప్పు కలిగించేరీతిలో "గడువు" కథ బాగుంది. పిచ్చి ఆచారాలతో చాదస్తాలు మనిషిలో జీర్ణించుకు పోయినా కొన్నిటికి తలవంచక తప్పదు "అంతే మరి" అని తెలియ జెప్పిన భాగవతులసుబ్రహ్మణ్యం గారికి, ప్రచురించిన మీకు అభినందనలు.

తంగోజని, కేసన కృష్ణవేణి, కాలారి గనేష్‌బాబు, [రేపల్లె]

*　　*　　*

అన్నాచెల్లెలు లాంటి మినీకథలు చాలాబాగున్నవి. పిల్లలు ఆత్రుతగా, ఆనందంగా చదువుటకు యిలాంటి కథలు తరచు ప్రచురించు తుండవలయును.

గుడిమెట్ల రాధాకృష్ణ (పాలకొల్లు)

## సీరియల్

శ్యామలగారు వ్రాసిన ఇదిఒకపాంథశాల, చాలా బాగున్నది. ముగింపు యింతతొందరగా అవుతుందని అనుకోలేదు. పాంథశాలకు అర్ధము చాలా చక్కగాచెప్పినారు. యింతమంచి సీరియల్ వ్రాసిన శ్యామలగారికి, అందించిన మీకు మా కృతజ్ఞతలు.

"రాగరేఖలు" కూడా చాలా బాగున్నది.యిది పత్రికకే మణిపూస వంటిది.

బి. కరుణమ్మ (గుంతకల్లు)

*　　*　　*

ఆంధ్రసచిత్ర వారపత్రికలో కొన్ని వారాలుగా ధారావాహికంగా ప్రచురించిన సీరియల్ నవల ఇది "ఒక పాంథశాల" చాలా ఇంటరెస్టింగ్‌గా ఉంది.

పి. ఎ. ఎల్. సంజీవరావు. పి, రామనాదరావు. (మధిర)

---

మాదే" "మా కాపురం మాదే" అంటూ హేమాహేమిలైన బహుగుణ, ఫెర్నాండేజ్, మధులిమాయేల లాంటి మహారథు లంతా యించుమించు "రాజ్‌నారాయణ్ దారి"నే పట్టడంతో వారంరోజులలో రాజ్‌నారాయణ్ ("యస్") మార్కు జనతా పార్టీలో 92 మంది బృందం ఎలా చేరారూ? అన్న ప్రశ్న ఉదయించనే లేదు. సామాన్యులకీ పరిణామాలు ఆశ్చర్యాన్ని కలిగించనూ లేదు.

## నానా కాలం గవర్నమెంట్

ఇప్పుడు వర్షాలు పడుతున్నాయి— వరదలు వొస్తున్నాయి— ఈ దశలో కొట్టుకు పోతామేమో నన్న భయంతో ఎన్నికల రంగంలో దిగడానికి ఏ పార్టీకీ— చివరకి ఇందిరమ్మ పార్టీకి కూడా దమ్ములేకపోవడంతో మరో సంకీర్ణ ప్రభుత్వానికి కొన్నాళ్లపాటు అవసరం కలిగే అవకాశాల మధ్య— దేశ ప్రజాస్వామ్య వ్యవస్థ నలిగిపోతున్న తరుణంలో — అటు రాజ్యాంగాన్ని యిటు ప్రజా శ్రేయస్సుని దృష్టిలో పెట్టుకుని వ్యవహరించవలసిన సంకట స్థితి; ఒకనాటి రాజకీయ దురంధరుడు యీనాటి రాష్ట్రపతి నీల సంజీవరెడ్డి గారి మీద పడ్డది!

## మున్నెన్నడూ లేని స్థితి

ప్రజలంతా నా వెనకనే వున్నారు; "దేవరాజ్ అర్సు" "చవాన్" తప్ప అంటున్న యిందిరాగాంధీ గారు కూడా జులై 16 నాడు ఎన్నికల పూను ఎత్తక పోగా "మూణ్ణాళ్ల ముచ్చట"గా వచ్చే సంకీర్ణ ప్రభుత్వం ద్వారా- 'సంజయ్ గాంధీ'ని బైట పడేసే మార్గాలే అన్వేషించ గలదని ఆ తర్వాత రంగంలోకి దిగుతారనీ పొలిటికల్ పండిట్స్ అంచనాలు వేస్తున్నారు.

ఇట్లాంటి పరిస్థితి గడిచిన 30 సంవత్సరాల్లో కనీసం కేంద్రంలో ఎన్నడూ తల ఎత్తలేదు కనుక— ప్రజలలో దేశశాంతి సుస్థిరతలపట్ల ఆందోళన సహజంగా నే యెక్కువైంది.

[పి రా జీ 17-7-79.]



# రాగరశ్మి

సీరియల్

మాధవపెద్ది ప్రఖ్యాశేవ ప్రసాద్



21

(గత సంచిక తరువాయి)

శిల్ప చదువులో చాలా చురుకు. చకచకా అన్నీ నేర్చేసుకుంటోంది. ఇంగ్లీషు పద్యాలు, తెలుగు పద్యాలు గడగడా అప్ప జెబుతుంటే- నేనూ- రామయ్యా - ముగ్ధుల మయి చూస్తూ వుండే వాళ్ళం !

తెలుగు-ఇంగ్లీషు సమానంగానే నేర్చు కుంటోంది శిల్ప. టీచరంతా పాపని మెచ్చు కుంటుంటే పొంగి పోయేది నా అంతరంగం. పాపని అందరికీ వరసకి నాకు అన్న కూతు రిగా పరిచయం చేశాను. సెలవుల్లో నేను పాపతోనే కలిసి వూళ్ళన్నీ తిరిగేవాణ్ని. శిల్ప కూడా అయా ప్రదేశాలన్నీ కుతూహలంతో చూస్తూ తన విజ్ఞానాన్ని పెంపు చేసు కునేది. రోజులు- నెలలు- సంవత్సరాలు- ఇట్లా జరిగి పోయాయో- ఏ విధంగా గడిచాయో కూడా తెలియలేదు మాకు.

శిల్ప పెద్దవుతున్నకొద్దీ అన్నీ గ్రహించు కోవడం నేర్చుకుంది. నన్ను కన్న తల్లిలా చూసుకోవడం మొదలు పెట్టింది.

"ఇన్నాళ్ళూ నన్ను చూసు కున్నారు. ఇంక నించీ మిమ్మల్ని నేను చూసు కుంటాను" అనేది.

ఆ చిన్నారి మనసులో నా గురించి ఏవో పెద్ద వూహాలు- కృతజ్ఞతా భావం వుండేవి కాబోలు ! అది ఏదో ఒక మాటల సందర్భంలో బయట పడింది.

"బాబాయ్ ! మీరు నా కోసం మీ సుఖా లన్నీ వదులు కున్నారు. ఏన్నో చేశారు-" అని అంటూ "ఆంటీని గూడా దూరం చేసుకున్నారు. నేనేం చేసి మీ ఋణం తీర్చు కోగలను ?" అని కన్నీళ్ళు పెట్టుకుంది.

నేను శిల్ప తల నిమురుతూ అన్నాను "చూడు తల్లీ ! మన మధ్య ఋణాలూ- కృతజ్ఞతలూ వుండ కూడదు. నేను చేసిం దేముంది? ఇది నా సంతోషం" అని !

కాలం ఎప్పుడూ ఒకే రీతిగా వుండదు మన పట్ల ! కాల క్రమాన రామయ్య మాకు దూరమయ్యాడు. నా లక్ష్మి భర్తతో వేరే వూరు వెళ్ళి పోయింది. నేను- శిల్ప మిగిలాం !

**జరిగినకథ 10** శిల్పకి బెంగుళూరు లోని కెనరా బాంక్‌లో ఉద్యోగం రాగా, కృష్ణ అక్కడ చేర్పించటానికి వెళ్తుంటే రైలు కోసం పరుగెడుతున్న చిత్రను చూచి అతని మనస్సు గతంలోకి పరుగెడు తుంది. తల్లి ప్రసవ వేదనతో మరణించగా, తన తండ్రి అయిన వెంకట్రావ్‌ను చిత్ర ద్వేషించటం కృష్ణకు చిత్రంగా తోస్తుంది. అవివాహితుడైన తనతో శిల్ప ఉంటున్న కారణంగా ఆమెకు వివాహం జరగదేమోనని బాధపడ్తాడు కృష్ణ. అరుణ్‌తో అర్చనకి పెళ్ళి నిశ్చయమయిం దని శిల్పకి చెప్తుంది వైదేహి. అర్చనని పెళ్ళి చేసుకోవటం అరుణ్‌కి గాని, అరుణ్‌ని పెళ్ళి చేసుకోవటం అర్చనకి గాని యిష్టముండదు. అరుణ్, శిల్ప ఒకరి నొకరు ప్రేమించుకుంటారు. చిత్రని పెళ్ళి చేసుకుంటానని ఆమె తండ్రి వెంకట్రావ్‌తో కృష్ణ చెప్పగా, ముహూర్తం పెట్టిస్తాడు. శిల్ప పూర్వ వృత్తాంతం గురించి అరుణ్‌తో చెప్తూ వుంటాడు కృష్ణ. తను ప్రయాణించే రైలులో దొరికిన పాపను తీసుకొని తన ఇంటికి చేరుకుంటాడు కృష్ణ. ఆ పాప మూలముగా కృష్ణ, చిత్రల మధ్య మనస్పర్ధలు చెలరేగుతాయి. కొ ... కు చిత్ర మరొకరిని పెళ్ళి చేసుకొంటుంది.

మేము కొన్ని అవసరాల వల్ల హైదరా బాద్‌లోనే వేరే ఇంటికి మారాం. శిల్పకి వయసు వచ్చినప్పటి నించీ శిల్పని గురించి, నా గురించి ఏవేవో గుసగుసలు బయ ల్దేరాయి. అది నేను సహించలేక పోయాను. శిల్పకి పెళ్ళి చెయ్యాలని నిర్ణయించు కున్నాను. శిల్ప పెళ్ళి వద్దంటే నేను నచ్చ చెప్పాను! శిల్ప కాలేజి చదువు పూర్తి యింది. పట్టుబట్టి ఎమ్. ఏ. కూడా చదివింది. ఇన్నేళ్ళూ శిల్ప నా దగ్గరే వుంది. ఎక్కడికి వెళ్ళినా కలిసే వెళ్ళే వాళ్ళం. కానీ- ఎమ్. ఏ. అయ్యాక మొదటిసారిగా ఉద్యోగరీత్యా నన్ను వదిలి బెంగుళూరు వెళ్ళింది. అదృష్టం కొద్ది వచ్చిందని చెప్పాలి. మిమ్మల్ని కలుసుకోవడం, పెళ్ళి కి సుముఖులవడం జరిగింది. ఇది శిల్ప గురించిన కథ. శిల్ప తల్లిదండ్రు లెవరో తెలీదు. ఏ కులమో, ఏ భాషో, ఏ ప్రాంతపు వాళ్ళో ఏమీ నాకు తెలీదు. అంతా మీరు విన్నారుగా ? అరుణ్ ... ఆమె కథంతా విన్నాక గూడా ఆమెని పెళ్ళి చేసుకోవడానికి మీకు అభ్యంతరం లేకపోతే, నేనూ శిల్ప గూడా అదృష్టవంతులం... కానీ... మీరు చాలా జాగ్రత్తగా ఆలోచించి... మరి ... నిర్ణయానికి రండి." అంటూ ముగించాడు కృష్ణ.

అంతా శ్రద్ధగా పొల్లు పోకుండా విన్నాడు అరుణ్. కృష్ణపట్ల అరుణ్‌కి గౌరవాభి మానాలు ఎక్కువయ్యాయి! కళ్ళు చెమర్చగా అన్నాడు "మీలాంటి ఉన్నత పురుషుల్ని, ఉత్తమ సంస్కారం గలవార్ని కలుసుకో వడమే అదృష్టం. మీలాంటి వారితో స్నేహం కలవడం ఇంకా అదృష్టం. అందులోనూ అదె... అది... బంధుత్వంగా మారడం ...ఓహ్ ... చెప్పడానికి మాటలు చాలవు..." మళ్ళీ తనే అన్నాడు అరుణ్.

"ఇన్నాళ్ళూ శిల్ప బాధ్యత మీరు వహిం

చారు ఇంక ముందు నాది ఆమె బాధ్యత. ఇంక మీరు నిశ్చింతగా విశ్రాంతి తీసుకోవాలి. శిల్ప నా భార్య! ఈ నిర్ణయం ఆమె కథ విన్నాక నాకా గట్టి పడింది!"

అరుణ్ మాటలు విన్న కృష్ణకి ఆనందంతో ఒళ్ళు పులకరించింది. గట్టిగా కౌగలించుకున్నాడు అరుణ్ ని!

"మీరు నాకు అన్ని విధాలా నచ్చారు. మా శిల్పకి తగిన భర్త మీరే...అని గర్వంగా చెప్పగలను. రేపే పురోహితుడి దగ్గిరకు వెళ్ళి అన్నీ మాటాడి వద్దాం."

ఇద్దరూ లేచి లోపలికి వచ్చారు పడుకోడానికి. అప్పటికే తెల్లవారబోతోంది!

## 22

ఆ తరువాత రోజు కృష్ణ, అరుణ్ తో వెళ్ళి పురోహితుడితో అన్నీ మాట్లాడి వచ్చాడు

పదిహేను రోజుల్లో ఒక ముహూర్తం వుందనీ, అది గాకపోతే మరో మూడు నెలల వరకూ ముహూర్తాలే లేవని చెప్పాడాయన.

పదిహేను రోజుల్లో వుండే ముహూర్తాన్నే ఖాయపరిచారు. కృష్ణకీ- అరుణ్ కీ కూడా తొందరగా వుంది! అందుకే ఆ ముహూర్తాన్నే ఖాయపరిచారు. పెళ్ళి! కృష్ణ మనసు ఎంతో సంతోషంగా వుంది. తను చేతులారా పెంచి పెద్ద చేసిన శిల్పకు పెళ్ళి! శిల్పకి పెళ్ళయితే, ఆమె అరుణ్ తో వెళ్ళిపోతే... తను? తను ఏకాకి! అప్పుడింక తను ఏ ఆశ్రమానికో వెళ్ళినా వెళ్ళవచ్చు!

కానీ... శిల్ప పిల్లలతో తను ఆడుకోవద్దూ? శిల్ప పిల్లలకి తాత కావద్దూ? శిల్పని విడిచి తను వుండగలడా? ఏదైతేనేం తనకింక నిశ్చింత! జీవితంలో తనో మంచి పని చేశాననే సంతృప్తితో తన జీవితాన్ని వెళ్ళబుచ్చుకోగలడు! అరుణ్ బొంబాయి వెళ్ళాడు- మరో వారంలో వస్తానని! అర్విన తల్లిదండ్రులదగ్గిరికి వెళ్ళి పెళ్ళివార్త తెలియజేసి, వాళ్ళని ఆహ్వానించి రమ్మంది శిల్ప! కృష్ణ కూడా అదే చెప్పాడు! వాళ్ళు కోపగించుకున్నా బతిమాలమంది శిల్ప! నవ్వాడు అరుణ్!

"నేనిప్పుడు బొంబాయి వెళ్ళేది అర్విన వరుడి విషయమే! వీలుంటే అదే ముహూర్తానికి అర్విన పెళ్ళిగూడా జరగాలని నా కోరిక. అప్పుడు అక్కా బావలకి నా మీద కోపం కాస్త తగ్గుతుందేమోనని నా ఆశ."

ఈ మాటకి సంతోషించారు, కృష్ణ శిల్ప కూడా!

"బాబాయ్... పెళ్ళి చేసుకొంటూ — నా స్వార్థం నేను చూసుకుంటున్నాను. నన్ను క్షమిస్తారా- మీరు?" అంటోంది పదే-పదే శిల్ప.

చివరికి కృష్ణ అన్నాడు-" అట్లాంటి మాటలని నా మనసు బాధ పెట్టొద్దమ్మా- శిల్పా-!"

* * *

పెళ్ళి పనులు అతి చురుకుగా సాగుతున్నాయి! సింపుల్ గా జరపాలని కోరరు- శిల్ప - అరుణ్ కూడా! కానీ-కృష్ణ - "ఇది నా ఆనందం— ఆ విషయం నాకు వదలండి -" అన్నాడు. వాళ్ళేం మాట్లాడలేరు. శిల్ప పెళ్ళి విషయం - మాలక్ష్మికి రాయించాడు కృష్ణ. ఉత్తరం అందగానే వచ్చేసింది మాలక్ష్మి!

శిల్ప పెళ్ళి వార్త విని ఉప్పొంగి పోయింది.

పెళ్ళిపనులన్నీ చకచకా చేసేస్తోంది మాలక్ష్మి! వయసు పైబడినా- ఉత్సాహం మాత్రం తగ్గలేదు. తనే నలుగురు ముత్తైదువులతో కలిపి పసుపు దంపింది.

ఇంట్లో సున్నాలు-రంగులు దగ్గరుండి వేయించింది. ఇప్పటికీ శిల్ప- మాలక్ష్మి ఒళ్ళో తల పెట్టుకుని, పడుకుని కబుర్లు చెప్తోంది.

మాలక్ష్మి శిల్పని ఆనాటి పాప నెట్లా ముద్దు చేసేదో, అట్లాగే ముద్దు చేస్తోంది.

ఇదంతా చూసి- కృష్ణ ఆనందిస్తున్నాడు. పెళ్ళికి నగలు కొన్నాడు కృష్ణ శిల్ప కోసం. ఇన్నాళ్ళా శిల్ప నగల మీద






# సంశయాత్మ

"సంశయాత్మా వినశ్యతి" అనే సూక్తి ఉన్నది. దీని అభిప్రాయమేమిటంటే సంశయం ఉన్నవాడు దేనిని గురించి ప్రయత్నించినా, దాన్ని నిర్వర్తించడంలో కృతార్థుడు కాలేడని. నిత్య శంకితునికి ఎప్పుడూ దుఃఖమే కలుగుతుందని మనం నీతి కథలలో చదువుకొనే ఉన్నాం.

మానవునికి త్వక్ చక్షుః శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణాలనే జ్ఞానేంద్రియాలు, వాక్‌పాణి పాదపాయూపస్థలనే కర్మేంద్రియాలు బహిరింద్రియాలు. మనస్సు అంతరింద్రియం. ఈ ఇంద్రియాలలో ఏది లోపించినా మనిషికి పరిపూర్ణతలేదు. బహిరింద్రియాలలో ఏది కుంటుపడినా జీవితాన్ని ఏ విధంగానో గడుపుకోవచ్చు. కుంటివాళ్ళు, గుడ్డివాళ్ళు, చెవిటివాళ్ళు ఎందరో జీవితాన్ని గడుపుకుంటున్నారు. అంతరింద్రియమైన మనస్సు దెబ్బతింటే మాత్రం జీవితం సక్రమంగా కొనసాగదు. బహిరింద్రియాలు ఎంత దృఢంగా ఉన్నా, అవి సరిగా పని చెయ్యలేవు. ముఖ్యంగా సంశయాత్ముడికి అవ్నీ అడ్డు తగులుతాయి. అతడు ఎంత ప్రతిభావంతుడైనా సరే సంశయముంటే బుద్ధి పనిచెయ్యదు. అనుకున్న పని సక్రమంగా జరగదు.

విద్యార్థి సంగతి చూద్దాం. అతడు మంచి తెలివైనవాడు కావచ్చు దానికి తోడు చాలా శ్రద్ధగా చదువుకోవచ్చు. పఠనీయ పుస్తకాలను క్షుణ్ణంగా అర్థం చేసుకుని, ఏది అడిగినా తడుముకోకుండా చక్కని సమాధానం చెప్పగలిగి ఉండవచ్చును. కాని పరీక్ష సమయంలో ప్రశ్న పత్రం చేతికి వచ్చినప్పుడు— అందులో కొన్ని ప్రశ్నలకు మాత్రం సమాధానం వ్రాయవలసిఉన్నప్పుడు "ఏ ప్రశ్నకు జవాబు వ్రాయడం? దీనికా— దానికా?" అని సందేహావస్థలో పడితే కాలం వృథా అయిపోయి తగిన మార్కులు తెచ్చుకోలేని పరిస్థితి యేర్పడుతుంది.

సందేహం యేర్పడినప్పుడు ధైర్యం క్షీణిస్తుంది. దిగులు కలుగుతుంది. ఉద్యోగం కోసం ఇంటర్వ్యూకి వెళినప్పుడు, అడిగిన ప్రశ్నలకు తగిన జవాబు చెప్పగలమో లేదో అని మనస్సు సంశయగ్రస్తమయితే పరీక్షకులను సంతృప్తి పరచడం సాధ్యంకాదు.

సంశయం ఉంటే "ఈ పనిని మనం తప్పకుండా నెరవేర్చగలం" అనే విశ్వాసం నశిస్తుంది. జీవితంలో ఏ విషయంలోనూ విజయం సాధించడం సాధ్యం కాదు. లౌకిక విషయంలోనే ఇలా ఉన్నప్పుడు పారలౌకికం గురించి ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు.

మనస్సు సంశయగ్రస్తమయితే స్థైర్యం నశిస్తుంది. చాంచల్యం ఏర్పడుతుంది. మనస్సు స్థిరంగా ఉంటేనే ధ్యానం చెయ్యడం కుదురుతుంది. సంశయం వల్ల మనో నైర్మల్యం దూరమైపోతుంది. నైర్మల్యం లేని మనస్సునకు శాంతి ఏర్పడదు. ఈ విషయాలన్నీ ఆలోచించే "సంశయాత్మా వినశ్యతి" అని చెప్పడం జరిగి ఉంటుంది.

# రాగరేఖలు

మోజు చూపించలేదు. కొంటానన్నా వద్దనేది. అందుకే ఇప్పటిదాకా ఏనగలూ లేనామెకి ఇప్పుడూ ఏవీ వద్దంది. కానీ— కృష్ణ వినలేదు. మాలక్ష్మితో సంప్రదించి నగలు పెట్టి కొన్నాడు. పెళ్ళికి కావలసిన సరుకులూ— సామగ్రీ— అంతా కొన్నాడు.

పాత్ర సామగ్రి అద్దెకు తేవాలని మాట్లాడుకున్నాడు. మేళం వాళ్ళని మాట్లాడాడు. పందిళ్ళు వెయ్యడానికి ఏర్పాటు చేశాడు. శుభలేఖలు అందంగా అచ్చువేయించాడు. తన పేరుమీద కొన్ని— అరుణ్ అక్కా— బావల పేరుమీద కొన్నీ వేయించాడు.

అందరికీ పంపించాడు.

శిల్ప తన స్నేహితురాళ్ళకి పంపించింది.

వారం రోజులు ఇట్టే గడిచిపోయాయి. ఇంక తరువాత రోజే అరుణ్ వచ్చేది!

ఇంట్లో పెయింట్‌తో రంగురంగుల ముగ్గులు వేస్తోంది— మాలక్ష్మి

పెళ్ళి బట్టలు కొనాలని బయల్దేరాడు— కృష్ణ. అరుణ్‌కి సూటు,వాళ అక్కా— బావలకి బట్టలు— ఇంకా పెళ్ళికి వచ్చిన వారందరికీ యథావిధి సత్కారానికి కావల్సిన బట్టలు— జాకెట్ గుడ్డలూ - చీరెలూ ధోవతులూ— ఉత్తరీయాలూ - అన్నీ లిస్టు రాసుకున్నాడు. పురోహితుణ్ణి అడిగి ఎప్పుడెప్పుడు— ఎవరెవరికి— ఏయే విధంగా కానుకలు ఇవ్వాలో తెలుసుకుని రాసుకున్నాడు.

"శిల్పా—పెళ్ళికూతురు చీర కొనాలను కుంటున్నాను — ఇవాళ. నీకు ఏ రంగు కావాలో చెప్పు?" అడిగాడు కృష్ణ—శిల్పని.

అతడి ఆపేక్షకి మాటి మాటికి కళ్ళు చెమరుస్తున్నాయి శిల్పకి.

'తన కన్న తల్లీ తండ్రీ అయినా- ఇంత శ్రద్ధగా అన్నీ చేసి వుండేవారు కాదేమో!' అనిపిస్తోందామెకి మాటి మాటికీ!

"బాబాయ్ ... మీరు ప్రేమతో ఏది తెచ్చినా నాకు సంతోషమే..." అంది మనసారా!

"కాదమ్మా...ముదురు రంగైతే బావుంటుందని నా ఉద్దేశం...ఏం—మాలక్ష్మీ—?"

"అవునండీ...ఎరుపు రంగైతే బావుంటుంది అమ్మాయిగారికి ..." అంది మాలక్ష్మి.

"ముదురు ఎరుపుగానీ...ముదురు నీలంగానీ తెస్తాను..."

"మీరెందుకు బాబాయ్... ఇన్నిసార్లు తిరగడం? ఊరికే శ్రమ కూడా!... అరుణ్ వచ్చాక కొన్ని పనులు అతడికి అప్పగించరాదూ? అన్నీ మీరొక్కరే చేసుకుంటూ శ్రమ పడుతున్నారు. ముందే

ఇంత అలసిపోతే— ఆ బ్రైనుకి ఇంకా ఎక్కువ శ్రమ వుంటుంది కదా ?...''

''చూడు తల్లీ...ఇది నాకు శ్రమకాదు. ఆనందం—నేను నా చేతుల్తో చెయ్యబోయే శుభకార్యం — ఇది. నేను చెయ్యబోయే మొదటి శుభకార్యం ఇదేగదా? అందుకని నా ఆనందాన్ని అర్థంచేసుకోమ్మా...''

ఏమీ మాట్లాడలేక పోయింది శిల్ప.

కృష్ణ వెనకే వాకిటిదాకా వచ్చింది.

కృష్ణ బజారెళ్ళి కావలసినవన్నీ కొన్నాడు సూటుగుడ్డ కొనడం కొంత ఆలస్యమైంది. అదీ కొన్నాక-

ఇంక పెళ్ళికూతురు చీర కోసం —చాలా షాపులు తిరిగాడు-ఎక్కడా ఏవీ నచ్చలేదు.

చివరికి ఒక షాపులో వున్న చీరలు నచ్చాయి. ఎర్రటి బనారస్ చీర సెలక్ట్ చేశాడు.

పెద్ద జరీ బుటా వుంది చీరంతా.

రెండు వైపులా అంచువుంది.

పమిటచెంగు జరీ ముద్ద.

ఈ చీరలో శిల్ప అపరంజి బొమ్మలా వుంటుంది-అనుకున్నాడు కృష్ణ.

అదే రంగు బ్లౌజు పీసు కొన్నాడు.

దగ్గిర-దగ్గిర- చీర- జాకెట్టు— కలిపి ఏనిమిది వందల రూపాయలైంది !

అయినా—చాలా తృప్తిగావుంది కృష్ణకి.

శిల్ప కోసం ఏది చేసినా అతడికి సంతోషంగానేవుంది ! పాక్ చేయించి—తీసుకుని - బిల్లు చెల్లించి బయటికి నడిచాడు. ఉత్సాహంగా ఇంటికొచ్చాడు టాక్సీలో. పాకెట్లన్నీ టాక్సీలోంచి లోపల పెట్టాడు.

ఒకసారి మళ్ళీ టాక్సీ అంతా చూసి లోపలికి నడిచాడు. చాలా పొద్దుపోయింది అప్పటికే !

భోజనాలు వడ్డించింది శిల్ప. పాకెట్టు విప్పి, అన్నీ చూపిస్తున్నాడు కృష్ణ.

మాలక్ష్మి- శిల్ప— బావుందని మెచ్చుకుంటున్నారు ఒక్కొక్కటీ చూసి !

అవి ఎంత కష్టపడి సెలక్ట్ చేశాడో వివరించి చెప్తున్నాడు కృష్ణ.

అన్నీ చూపించడం అయింది.

సూటుగుడ్డ చాలా బావుందన్నారు— శిల్ప మాలక్ష్మి-గూడా ! ''అరుణ్ వంటి మీద ఈ రంగు చాలా బావుంటుంది.'' అన్నాడు కృష్ణ.

అరుణ్ పేరువింటేనే మధురంగావుంది శిల్పకి ! అరుణ్ కళ్ళముందు మెదిలాడు.

అంతలో—

కృష్ణ ఏదో కంగారుగా వెదకసాగాడు.

''ఏమిటి-ఏమిటని-'' అడిగారు శిల్ప, మాలక్ష్మికూడా ! ''పాకెట్- చీర పాకెట్ ఏది ?'' అన్నీ తీసి తీసి వెదుకుతున్నాడు.

''ఎక్కడాలేదు —చీర పాకెట్ !'' గుండె జల్లుమంది కృష్ణకి ! ''షాపులోనే మర్చిపోయానేమో-'' అనుకున్నాడు. అతడికి మెదడు పనిచెయ్యలేదు- వణుకు పట్టుకుంది ! ''ఇదేమీ అపశకునం కాదుకదా?'' ''టాక్సీలోనే వుండిపోయిందా ?'' ''లేక పోతే కింద ఎక్కడన్నా జారి పోయిందా?'' వాకిట్లోకి వచ్చి వెతికాడు—లేదు.

''ఇప్పుడే వస్తానంటూ-'' మళ్ళీ చెప్పి లేసుకుని హడావిడిగా బయటికి వచ్చాడు.

శిల్ప, మాలక్ష్మి ఏమీ మాట్లాడలేక పోయారు. వడ్డించిన అన్నంవైపు చూస్తూ కూచున్నారు ! వాళ్ళూ ఏం మాట్లాడుకోలేదు !

* * *

కొన్న షాపుకి వెళ్ళాడు ఆటోలో కృష్ణ.

వాళ్ళని అడిగితే — వాళ్ళు, 'మీకే ఇచ్చాము'ని నొక్కి చెప్పారు !

షాపు బయటంతా వెతికాడు. లేదు. ''ఇందాక, కొంతసేపు టాక్సీగానీ, ఆటో గానీ, దొరకక, కాసేపు -సందుచివర పాకెట్లు చేత్తో పట్టుకుని, నిలబడ్డాడు. అక్కడేమన్నా జారి పడిపోయిందేమో '' అనుకుంటూ సందు చివరకి వెళ్ళి వెతికాడు.

అక్కడ కిళ్ళీ షాపువాళ్ళనీ, సోడా కొట్టువాళ్ళనీ, అడిగాడు.

వాళ్ళు మాకేమీ తెలియదన్నారు.

''ఇంక పోయినట్లేనా ?''

''ఇంకొకటి కొనచ్చులే '' అని ఎంత సర్ది పెట్టుకుందామన్నా అది ఏదో అపశకునం లాగే తోచింది కృష్ణకి.

అన్యమనస్కంగా, పిచ్చెక్కినవాడిలాగా, అక్కడే ఎంతోసేపు నిలబడి పోయాడు. చాలా సేపటి తరువాత, కాళ్ళీడ్చుకుంటూ, నిరాశగా ఇంటికి బయల్దేరాడు.

పరధ్యానంగా, దిగులుగా నడుస్తున్నాడు కృష్ణ. అంతలో ఆటో వస్తున్నట్లు చూశాడు.

చెయ్యెత్తి అవతలవైపున వున్న ఆటోను ఆపుతూ, రోడ్డు దాటబోయాడు.

అతి వేగంగా వస్తోంది లారీ. రెప్ప పాటున రోడ్డును దాటాలని పరుగెత్తాడు. రాయి తగిలి కాలు స్లిప్ అయింది. నిలదొక్కుకోలేకపోయాడు. కిందికితూలాడు. లారీకి ప్రయత్నించినా బ్రేకులు పడలేదు. పడిన కృష్ణమీది నుంచి లారీ దూసుకు వెళ్ళి కాస్త దూరంలో ఆగింది. అంతా రక్తమయం. ఆక్సిడెంట్ ! వెంటనే జనం గుమిగూడారు. కృష్ణని హాస్పిటల్లో చేర్చారు. జేబులో విజిటింగ్ కార్డుని బట్టి ఇంటికి కబురు అందింది.



## 23

# రాగరేఖలు

అరుణ్ అప్పుడే వచ్చాడు. శిల్ప పడిపోయివుంది. మాలక్ష్మి ఉపచారం చేస్తోంది ఏడుస్తూ. సంగతి తెలుసుకున్న అరుణ్ నిర్ఘాంతపోయాడు. ఒకరోజు ముందు రాగలిగావన్న సంతోషం హారతి కర్పూరంలాగా హరించుకు పోయింది.

శిల్పకి కాస్త స్పృహ వచ్చాక, అందరూ హాస్పిటల్‌కి బయల్దేరారు. వెళ్తున్నంత సేపూ శిల్ప కంటికీ, మంటికీ ఏకధారగా ఏడుస్తోంది. ఆమెని పట్టడం ఎవరికీ సాధ్యం కావడం లేదు. గుండెలు పగిలేటట్టు దుఃఖిస్తోంది. మంచం మీద అచేతనంగా పడివున్నాడు కృష్ణ. వళ్ళంతా కట్లు కట్టబడి వున్నాయి. అక్కడ ఏ విధమైన శబ్దమూ వుండకూడదనీ, పేషెంట్ని డిస్టర్బు చెయ్యకూడదనీ డాక్టర్లు అనడంతో శిల్ప నిశ్శబ్దంగానే వున్నా కుమిలి కుమిలి ఏడుస్తోంది.

పరిస్థితి చాలా ప్రమాదకరంగా వుందనీ, ఇప్పుడే ఏమీ చెప్పలేమనీ అన్నారు డాక్టర్లు. ఒక కాలూ, చెయ్యీ పూర్తిగా చితికి పోయాయనీ, అవి తీసెయ్యవలసి రావచ్చనీ, ప్రాణానికి ప్రమాదం వుండక పోవచ్చునేమోననీ అరుణ్ అడిగితే వివరించారు డాక్టర్లు. కానీ ఏదీ గాఢంగా ఇప్పుడే చెప్పలేమన్నారు. ఆశాలేశంతో తిండీ, నిద్రా లేకుండా నిరీక్షిస్తూ గడిపారు అక్కడే ముగ్గురూను.

రక్తం చాలా పోయిందని రక్తం ఎక్కిస్తున్నారు. స్పృహ మాత్రం రాలేదు. ఆ స్థితిలో కృష్ణని చూస్తున్న కొద్దీ దుఃఖం ఇంకా ఇంకా ఎక్కువవుతోంది శిల్పకి. "నా కోసమే తన జీవిత మంతా గడిపారు. చివరికి నాకోసమే తన ప్రాణం మీదికి కూడా తెచ్చుకున్నారు."

"నేనే కనిపించకుండా వుంటే, నేనే గనక బాబాయ్‌కి దొరక్కుండా వుండి వుంటే, ఆయన హాయిగా, సుఖంగా భార్యా పిల్లలతో కళకళలాడుతూ వుండేవారు. నావల్ల ... నావల్ల ... మొదట్నించీ ఆయన కష్టాలే పడ్డారు. సుఖం అనేదే లేకుండా బతికారు. జీవితమంతా త్యాగం చేశారు. నేను ప్రతిఫలంగా ఏమీ చేయలేక పోయాను. నా స్వార్థం నేను చూసుకున్నాను."

ఓదార్చిన కొద్దీ ఎక్కువవుతోంది దుఃఖం. ఆమె మనసు తీరుని అర్థం చేసుకున్న అరుణ్, మౌనంగా వుండిపోయాడు!

(ఇంకా వుంది)

# కృత్రిమంగా ఒక చిన్న సూర్యుణ్ణి చెయ్యాలని యత్నం

గత 30 సంవత్సరాలుగా నక్షత్రాల లోపల జరుగుతున్న రసాయనిక ప్రతిక్రియలకు సంబంధించిన కీలకాన్ని కనగొనేందుకు మానవ నిర్మిత చిన్న సూర్యుణ్ణి ఒకదాన్ని సృష్టించేందుకు శాస్త్రజ్ఞులు ఓపిగ్గా ప్రయత్నాలు చేస్తూ వచ్చారు. వారు కృత్రిమ సూర్యుణ్ణి రగిలించి నిర్దేశించ గలిగితే ఉదజనిలోగల భారీ కేంద్రకమైన డ్యుటీరియం, ట్రిటియమ్‌ల సమ్మేళన క్రమం ద్వారా విడుదలయ్యే గొప్ప ఇంధన వనరులు ప్రజలకు అందుబాటులోకి వస్తాయి. ఈ శక్తి అనేక తరాలపాటు వినియోగపడుతుంది. గత సంవత్సరాంతంలో సోవియట్ యూనియన్, అమెరికా, యురాటమ్ సభ్య దేశాలు, జపాన్, అంతర్జాతీయ అణు సంస్థ ఆధ్వర్యాన సమిష్టిగా అణువిద్యుత్ రియాక్టరును నిర్మించేందుకు నిర్ణయించుకున్నాయి.

అంతర్జాతీయ "నార కొలిమి"కి రూపకల్పన చేయడానికి ఏర్పడిన ఉపసంఘం సమావేశం ఇటీవలే వియన్నాలో జరిగింది. ఈ సమావేశంలో సోవియట్ బృందానికి అకడమీషియన్ బి. బి. కదోమ్త్సెవ్ నాయకత్వం వహించారు. ఆయన తిరిగి వచ్చాక "సోషలిస్టిచెస్కయా ఇండస్ట్రియా" ప్రత్యేక విలేఖరి ఆయనను ఇంటర్వ్యూ చేశారు. ఆ ఇంటర్వ్యూలో యిలా చెప్పారాయన ఇప్పుడు నిర్మించబడుతున్న రియాక్టరు "తోకమాక్" రకానికి చెందినదయి వుంటుంది ఈనాడు ప్రపంచమంతటా 50 తోకామాక్ రియాక్టర్లు పని చేస్తున్నాయి. వాటి సహాయంతో శాస్త్రజ్ఞులు వాయు మిశ్రమాలను మిలియన్ల కొలది డిగ్రీల వరకు వేడిచేసి వాటిని అదే ఉష్ణోగ్రత వద్ద నిలబెట్టి వుంచేందుకు అనువయిన పద్ధతులు రూపొందిస్తున్నారు. ప్రయోగాలు, సైద్ధాంతిక పరిశోధనల వలన తేలిందేమిటంటే ఇంతకంటే పెద్దవి, మరింత ఖరీదయినవి అయిన రియాక్టర్లను, నిర్మించేందుకు మనం కృషి సాగించ వలసి వుంటుంది. ఉదాహరణకు యురేటమ్ సభ్య దేశాలు సమిష్టిగా తమ కొరకు ఒక "జెట్ తోకమాక్" ను నిర్మించుకుంటున్నాయి. ఇలాంటి పెద్ద రియాక్టర్లు అటు అమెరికాలోను, ఇటు జపాన్‌లోను నిర్మితమవుతున్నాయి. సోవియట్ యూనియన్ బ్రహ్మాండమయిన అయస్కాంత వలయాలతో కూడిన టి-15 రకం తోకమాక్‌ను నిర్మిస్తోంది. వివిధ దేశాల వైజ్ఞానిక కార్యకలాపాలను సమన్వయించడంద్వారా అణు విద్యుత్ ప్రక్రియను నిర్దేశించాలనే మన సమిష్టి లక్ష్యాన్ని సాధించడంలో మనం ఎంతో పురోగమించాం. ఇందు మూలంగా ఎంతో కాలం కలిసి వస్తుంది కూడా.

సోవియట్ చొరవ మూలంగా యిందు భాగస్వాములయిన వివిధ దేశాలు యురేటమ్‌ల నుండి తలకొక నలుగురు ప్రతినిధుల చొప్పున 16 మందితో ఒక అంతర్జాతీయ సమితి నెలకొల్పబడింది.

## అంతర్జాతీయ రియాక్టరు

ఈ అంతర్జాతీయ రియాక్టరు పేరు 'ఇంటర్'. అణు ఉష్ణ ప్రక్రియ నిర్దేశ క్రమం ద్వారా బృహత్తర శక్తిని విడుదల చేయటం సాధ్యమని ఇంజనీరింగ్, సాంకేతిక పరిజ్ఞానాల దృష్ట్యా ధృవీకరించాల్సివుంది. ఈ రియాక్టరును అణు ఉష్ణ ప్రక్రియ ద్వారా బృహత్తర సానుకూల శక్త్యుత్పాదక సాంకేతిక నిర్మాణంగా మనం పరిగణిస్తున్నాం. అణు ఉష్ణ ప్రక్రియ ఉత్పత్తి చేయగల సమస్త శక్తిని అది మనకందివ్వగలదని శాస్త్రజ్ఞులు ఆశిస్తున్నారు. పారిశ్రామిక రియాక్టర్లను, మిశ్రమ పదార్థాలను రూపకల్పన చేసి బ్రహ్మాండమైన ఉష్ణోగ్రత ప్రభావంతో శక్తివంతమైన రేడియేషన్, బలీయమైన అయస్కాంత క్షేత్రాల ద్వారా వాటి ధర్మాలను మార్చి వేయటం కూడా మన లక్ష్యంగా ఉన్నది.

1979 సంవత్సరానికి యీ కార్మాగారం పరిమాణాలను, సాంకేతిక రూపురేఖలను నిర్ధారించటం జరుగుతుంది. ఈ పనిని నాలుగు దశలుగా విభజించడం జరిగింది. సోవియట్ యూనియన్, అమెరికా, జపాన్, యురేటమ్‌ల నుండి తలకొక 15-20 చొప్పున అత్యంత నిపుణులైన శాస్త్రజ్ఞులు అణు ఉష్ణ ఇంధన ఇంజనీరింగులో సాధించిన శాస్త్రీయ సాంకేతిక పరిజ్ఞానాన్ని విశ్లేషిస్తున్నారు. తమ ప్రథమ సమావేశంలో అంతకు ముందు రూపొందించబడిన సుదీర్ఘ ప్రశ్నావళికి సమాధానాలు కూర్చుకుంటున్నారు. మనకిప్పటి వరకు తెలిసిన విషయాలేమిటో, తెలియనిదేమిటో సమీక్షించుకుంటున్నారు.

[డా. కదొమిత్సేవ్, సో. వా. సం.]





# లాండ్‌లార్డ్స్

పి. వి. ఆర్. శివకుమార్

"ఎలా వుంది ఇల్లు?"

ఇద్దరం కుర్చీలో కూర్చున్నాక, సిగరెట్ వెలిగిస్తూ అడిగాడు పానకాలు.

"బావుంది. అద్దెకిచ్చే పోర్షనన్నట్టు కాకుండా, అన్ని వసతులూ అమర్చారు. ఇంత మంచి పోర్షన్ దొరకటం ఈ వూళ్ళో చాలా కష్టమే"

మనస్ఫూర్తిగా అన్నాడు శేషగిరి.

"అద్దెకివ్వటం, ఇవ్వకపోవటం తరవాతి మాట. సొంత ఇల్లు అంటూ కట్టుకుంటున్నప్పుడు అన్ని వసతులూ చూసుకు కట్టుకోకపోతే ఎలా?"

"ఆఫ్‌కోర్స్. కానీ చాలామంది వ్యాపార దృక్పథంతోనే కడుతున్నారీమధ్య అద్దె యిళ్ళు. అలాంటి చోట్ల వసతుల కన్నా, వైశాల్యమే ముఖ్యమయి పోతుంది. ఎన్ని గదులు కట్టాం, ఎన్ని పోర్షన్లు అవుతాయి అనే తప్ప, ఎన్ని వసతులు అమర్చాం, ఏపాటి సుఖంగా ఎవరయినా ఇక్కడ వుండగలరు అన్న ఆలోచన వుండదు"

"ఆ మాట నిజమే. కానీ, వెధవది మనం అంత వ్యాపారాత్మకంగా ఆలోచించలేమండీ! అద్దెకుండే వాళ్ళు యివాళుంటారు— రేపు మారతారు. ఇల్లు మాత్రం ఎల్లకాలం మనదే కదా!" అన్నాడు పానకాలు.

"మీ ఫిలాసఫీ బావుంది. నిజమే కూడా!" నవ్వాను శేషగిరి.

"అయిదేళ్ళవుతోంది యిల్లు కట్టించి. కొత్తలోనే దిగారు యీ పోర్షన్‌లో వాళ్ళు. అప్పుడు ధరలు ఎలా వుండేవో తెలుసుగా— తొంభై రూపాయలకి ఇచ్చాను పోర్షన్. ఇప్పుడు ప్రతిదీ ఎలా మండి పోతున్నాయో చూస్తున్నారా— అయినా నయాపైస అద్దె పెంచలేదు. ఇటు యిళ్ళ పన్నులు చూస్తే కళ్ళు తిరుగుతున్నాయి. సొంత యింటి కన్న అద్దె కొంప నయం అనిపిస్తోంది. ఇలాంటి పరిస్థితుల్లో యింత కన్న ఏం చెయ్యగలను?"

పానకాలు మాటల్లో సమర్థన కన్న సత్యమే ఎక్కువగా వున్నట్టు తోచింది శేషగిరికి.

"అవును. ఎవరైనా ఇంతకన్న ఏం చెయ్యగలం" అన్నాడు.

"రెండొందలని చెప్పినా ఎవరు పడితే వాళ్ళు రెడీగా వచ్చేస్తారు. కానీ, మనకి మనుషులు ముఖ్యం కానీ— డబ్బు దేముంది ఇలా వస్తే అలా పోతుంది. నూట డెబ్భై అయిదు రీజనబుల్ రెంటే అనుకుంటున్నాను..."

'రీజనబుల్ కాదు—చవకే!' మనసులో అనుకున్నాడు శేషగిరి.

"ఆల్ రైట్. ఓ పాతిక అటో యిటో మనసులు కలియటం ముఖ్యం. నాకేం అభ్యంతరం లేదు." అన్నాడు బయటికి.

"ఓ.కే. రేపుదయం వచ్చేస్తారు వాళ్ళు వూర్చించి. మళ్ళీ నేను చెప్తాను. రేపు సాయంత్రం మీరు రండి, మా అత్తయ్యగారబ్బాయి అని చెప్తాను."

"అలాగే" అన్నాడు శేషగిరి. అయాచితంగా లభించబోతున్న అందమయిన ఆ యింట్లోని పోర్షన్ అతన్లో ఆనందాన్ని నింపింది.

* * *

''రా, రా! ఏం ఇంతాలస్యమయింది ?'' ఆదరంగా ఆహ్వానించాడు పానకాలు.

''ఇతనే మా మేనత్త కొడుకు. చెప్పానుగా, నెలరోజులైంది యిక్కడికి ట్రాన్స్‌ఫరై వొచ్చి. ఇల్లు దొరక్క నానా అవస్థగానూ వుందిట. అందుకే యింకా వాళ్ల ఫామిలీని కూడా తీసుకురాలేదు.''

పరిచయం చేశాడు అక్కడే కూర్చునివున్న మరో వ్యక్తికి.

''ఈయనే యిప్పుడా వాటాలో వుంటున్నది. మంచి స్నేహితులమైపోయాం ఈ అయిదేళ్లలోనూ. తప్పనిసరికాబట్టి ఖాళీ చేస్తున్నారుగానీ, లేకపోతే...''

''నెలరోజులుగా ప్రయత్నించినా ఎక్కడా మంచి యిల్లు దొరకటంలేదు...'' అపాలజిటిగ్గా అన్నాడు శేషగిరి.

''అయినా, నన్నొదిలి వేరే యింట్లో నిన్నుండనిస్తా్రనా ?'' నవ్వాడు గట్టిగా పానకాలు, ''అందుకే యిల్లు దొరక్కుండా పోయింది.''

''ఫర్లేదులెండి. ఫస్ట్‌కి నేనే ఖాళీ చేసేస్తాను. మా ఆవిడ ఎలాగూ పురిటి వెళ్లిపోయిందికదా! మరో మూణ్ణెల్లదాకా నేనొక్కడినే ఏ ఫ్రెండ్ గదిలోనో తలదాచుకుంటే, ఈలోగా మరో యిల్లు దొరక్కపోదు.'' ఇబ్బందిగా అన్నాడు ఆ వ్యక్తి.

శేషగిరికి అతని మొహం చూస్తే జాలివేసింది. తను ఆడుతున్న నాటకానికి, తనమీద తనకే అసహ్యంవేసింది. కానీ, ఏ వారానికా వారం 'యిల్లు దొరికిందా ?' అంటూ శ్రీమతి కురిపిస్తున్న ఉత్తరాల బాణాలు గుర్తొచ్చాయి. నెల్లాళ్ళుగా సరయిన యింటికోసం తను పడుతున్న పాట్లు గుర్తొచ్చాయి. అతనిమీది జాలినీ, తనమీది అసహ్యాన్నీ అవి చంపేశాయి. ముఖాన ఓ చిర్నవ్వు పులుముకు మౌనంగా వుండిపోయాడు. ఆ రాత్రే భార్యకి ఉత్తరం రాసిపడేశాడు కూడా—

''ఇల్లు దొరికింది. మొదటి వారంలో వచ్చెయ్యి'' అని!

* * *

''అబ్బ! చాలా బావుందండీ యిల్లు. పెరట్లో చెట్లు, ముందువయిపు పూల మొక్కలు! బానే సంపాయించారు!'' మెచ్చుకోలుగా అంది ఇల్లంతా తిరిగి చూసిన సావిత్రి, శేషగిరితో.

''మరేమనుకున్నావ్ ? మన నోరు మంచిదైతే ఏవూరైనా మంచిదౌతుందిట! నెల్లాళ్ల స్నేహంతో — అయిదేళ్లనించీ వుంటున్న వాళ్లచేత ఖాళీ చేయించి — నాకిచ్చేశాడు పానకాలు!'' గర్వంగా అన్నాడు శేషగిరి.

''మీ నోటి సంగతే చెప్పుకోవాలి'' అంది సావిత్రి మూతి వంకరగా తిప్పి.

''ఏం దానికేం తక్కువయింది ?''

''అబ్బే... ఏమీ కాలేదు. నామీద తప్ప అందరిమీద మంచితనాన్నే కురిపిస్తుంది.'' వెక్కిరింతగా నవ్వింది సావిత్రి.

పానకాలు భార్య సుందరికీ, సావిత్రికీ కూడా వీళ్లు వచ్చిన వారం రోజుల్లోనే మంచి స్నేహం కుదిరిపోయింది. అందుకు నిదర్శనంగా వాళ్ల యింటి కూరలూ వీళ్ల యింట్లోకీ, వీళ్ల యింటి పూరగాయలు వాళ్ల యింట్లోకీ రవాణాలు సాగించటమూ మొదలయింది

తృప్తిగా గాలి పీల్చుకున్నాడు శేషగిరి.

* * *

ఏడాది కాలం గడిచిపోయింది. ఈ ఏడాది లోనూ శేషగిరికీ, సావిత్రికీ ఆ యింటితో బంధం బలపడింది. నెల రోజుల క్రితం సుందరి పురుడు పోసుకున్నప్పుడు సావిత్రి ఆమెకి సొంత అక్కలా సాయం చేసింది. సుందరి ఆస్పత్రిలో వున్న వారం రోజులూ, ఆ తరవాత అడపా, దడపా అవసరమయినప్పుడూ పానకాలుకీ, సుందరికీ కూడా తన యింట్లోనే వంటచేసి పంపింది సావిత్రి. అది వాళ్లమధ్య బంధం బలపడేందుకు మరింత దోహదం చేసింది. ఇంట్లో చేరిన కొత్తలో అప్పుడప్పుడు పానకాలుకి తన స్కూటర్ మీదే లిఫ్ట్ యిచ్చే శేషగిరి యిప్పుడు ప్రతిరోజూ అతన్ని తనే తీసుకువెళ్తున్నాడు. ఎప్పుడేనా పానకాలుకి బయల్దేరడం కాస్త ఆలస్యమయితే, తనూ ఆగిపోయి, ఆఫీసుకు ఆలస్యంగా వెళ్లి ఆఫీసర్‌నించి చివాట్లు కూడా పానకాల్తో పాలుపంచుకుంటున్నాడు. పానకాలు, సుందరి సినిమాలకీ, షికార్లకి తిరగటానికూడా, వీలయినప్పుడల్లా, తన స్కూటరివ్వటానికి శేషగిరి సంశయించటం లేదు — అటువంటి సందర్భాల్లో సావిత్రి వెనకనించి గొణుగుతున్నా!

''నువ్వింకా వాళ్లని పరాయివాళ్లుగా భావించటంమేం బాగాలేదు సావీ, అతను ఆఫీసులో నాకన్న సీనియర్. ఇక్కడా మన యింటి హక్కుదారు. అయినా అలాటి ఫీలింగ్ ఎక్కడేనా చూపిస్తున్నాడా, చెప్పు ? అయినప్పుడు మనం అతనికి కాస్త చేదోడువాదోడుగా వుంటేనూ, ఎప్పుడేనా మన స్కూటర్ యిస్తేనూ నష్టపోయేదేముంది ?

ఇల్లు దొరకని స్థితిలో వున్నవాళ్లని ఖాళీ చేయించి మనకి తక్కువ అద్దెకే యిచ్చాడు. ఇప్పుడీ యింటికి ఎవరైనా రెండొందలయాభై అయినా ఇస్తారు. అలాగని మనని అద్దె పెంచమన్నాడా ? మనం ఎప్పటికేనా సొంత ఇల్లు కట్టుకుంటే తప్ప ఈ యిల్లు ఖాళీ చెయ్యనక్కర్లేదు కదా! అలాటప్పుడు మనమంతా ఒక్క కుటుంబంలా మసులుకోవలసిన అవసరం వుందా, లేదా ?''

అంటూ భార్యకి సర్దిచెప్పేవాడు.

* * *

అర్ధరాత్రివేళ బజర్ మోగిన చప్పుడుకి లేచాడు శేషగిరి. వెళ్లి తలుపు తీశాడు. ఎదురుగ్గా టెలిగ్రాం మెసెంజర్.

## పశ్చిమ జర్మనిలో గోమాత

గోమాతను పూల మాలతో సత్కరించటం విన్నారా! మనం భారతావనిలో గోమాతను పూజిస్తాం. అలాగే పశ్చిమ జర్మనీలో బవేరియా రాష్ట్రంలో ప్రతి సంవత్సరం- గోవుల మందలను గోపాలురు వేసవి కాలంలో పర్వత ప్రాంతాలకు మేతకై తీసుకుపోతారు. వేసవి ముగియటంతోనే యీ మందలను తిరిగి గ్రామాలకు తీసుకు వస్తారు. ఇలా తిరిగి తీసుకు వచ్చినపుడు గ్రామస్తులందరూ గోవులను పూలతో అలంకరించి వేడుక చేసుకుంటారు. ఆ పుష్టిగా వున్న గోవులను చూచినపుడు, పుష్పములతో అలంకరించినపుడు కనుల పండుగగా వుంటుంది. ఆవుల మందలను ఊరేగింపుగా తీసుకువస్తారు. ప్రతి గోవుకు శరీరం అంతటా పుష్పాల దండలను కడతారు. తలపై పుష్ప కిరీటాన్ని ధరింపచేస్తారు. యీ గోమాతలను గ్రామీణ స్త్రీలు హారతులతో స్వాగతం పలుకుతారు

''ఎవరికి టెలిగ్రాం ?'' ఆత్రంగా అడిగాడు.

''టి. పానకాలు.''

''ఐసీ! అంటే మా పక్కవాటా. ఉండు పిలుస్తాను.'' అంటూ వెళ్లి పానకాలుని లేపాడు.

''మా పెద్దమ్మ కొడుక్కి సీరియస్‌గా వుందిట. వెంటనే వెళ్లాలి.'' చెప్పాడు పానకాలు, టెలిగ్రాం చదవగానే.

''ఒక్కడే కొడుకు ఆవిడకి. చిన్నవాడే! ఇద్దరు పిల్లలున్నారు కూడా. ఏమయిందో ఏమిటో...'' కంగారుగా అన్నాడు మళ్లీ.

''అయామ్ సారీ'' అన్నాడు శేషగిరి, ''ఏ వూరు వాళ్లది ?''

చెప్పాడు పానకాలు. టైం చూశాడు శేషగిరి. పదకొండు ముప్పావు కావొస్తోంది.

''ఇప్పుడు రెండింటికి ఓ ట్రెయినుంది అక్కడికి. వెళ్తారా ?'' అడిగాడు. పానకాలు కంగారుగా తలూపాడు,

''వెళ్లాలి. వీలయినంత వెంటనే!''

''డబ్బుందా ?''

''వుంది.''

పానకాలు లోపలికి వెళ్లి, భార్యని లేపాడు. అరగంటలో యిద్దరూ తయారయ్యారు.

శేషగిరి స్కూటర్‌మీద వెళ్లి ఒక ఆటో తీసుకొచ్చాడు. పానకాలు, సుందరి దాంట్లో బయల్దేరాక, వెనకే వెళ్లి, రైలుకి టికెట్లు కొని, ట్రెయినెక్కించి, ధైర్యం చెప్పి,

# లాండ్ లార్డ్

తిరిగి యిల్లు చేరుకున్నాడు. అప్పుడు టైం రెండున్నర! అంతసేపూ యింట్లో సావిత్రి ఒక్కతే బిక్కు బిక్కుమంటూ కూర్చునివుంది!

* * *

పానకాలు వెళ్లిన నాలుగు రోజులకి ఉత్తరం వచ్చింది శేషగిరికి.

''పెద్దమ్మ కొడుకు పోయాడు — స్కూటర్ ప్రమాదంలో. మరో పది, పన్నెండు రోజులదాకా రాలేను. ఆఫీసులో చెప్పి, లీవ్ సంగతి చూడు.'' అని రాశాడు అతను.

శేషగిరి మనసు తనే ఎవర్నో పోగొట్టుకున్నట్లు ఫీలయింది, పానకాలు కజిన్ మరణ వార్త తెలియగానే.

మర్నాడు ఆఫీసులో ఆ ఉత్తరం చూపించి, అతను రాగానే శలవు చీటీ రాస్తాడనీ, ప్రస్తుతానికి ఆ ఉత్తరాన్నే 'ఇంటిమేషన్'గా వుంచుకోమనీ ఆఫీసర్‌కి యిచ్చాడు. ఇలా చేశాననీ, వీలు చూసుకుని అక్కడి పనులన్నీ పూర్తయ్యాకే రమ్మనీ పానకాలుకి రాశాడు.

* * *

నెలరోజులు గడిచేక పానకాలు మళ్ళా మామూలు మనిషి అయ్యాడు. ఆ నెల మొదటిరోజున అద్దె యివ్వబోయాడు శేషగిరి అలవాటుప్రకారం.

''నిజా కొంచెం మాట్లాడాలి. వారంరోజులుగా చెప్పాలనుకుంటున్నాను. ఎలా చెప్పాలో తోచటంలేదు'' అన్నాడు పానకాలు, అద్దె డబ్బు అందుకోకుండానే.

''అదేమిటి? నాదగ్గర యింకా మొహమాటమా ?'' అన్నాడు శేషగిరి.

''మా కజిన్ పోయాడు కదా. మా పెద్దమ్మకి వాడొక్కడే కొడుకని చెప్పాననుకుంటాను. నేను తప్ప ఆ కుటుంబానికిప్పుడింకెవ్వరూ లేరు...'' ఆగాడు పానకాలు.

అతడేం చెప్పదల్చుకున్నాడో శేషగిరికి అర్థంకాలేదు.

''ఊఁ...'' అన్నాడు తొందరని సూచిస్తూ.

''ఇప్పుడు వాళ్ళింక ఆ వూళ్ళో వుండేందుకు ఏ అవసరమూ మిగల్లేదు. అందుకే నాదగ్గరకే వచ్చెయ్యమని రాశాను. వచ్చేస్తారు బహుశః పై నెలలో...''

''అదే మంచిది కానీ, నీమీద, పాపం... మరిన్ని బరువు బాధ్యతలు...''

''ఏం చేస్తాం! అయినవాళ్ళకోసం ... తప్పదుగా!'' నిట్టూర్చాడు పానకాలు. ''వాళ్ళు వచ్చేరంటే ఇప్పుడు మేమున్న పోర్షన్ చాలదు. వాళ్ళకోసం ... వేరే యిల్లయినా చూడాలి ఈ చుట్టుపక్కలే...''

''ధ ... అలా ఎందుకు ?'' అనేశాడు శేషగిరి. వెంటనే గతుక్కుమన్నాడు. 'తనిప్పుడు పోర్షన్ ఖాళీచెయ్యాలా ?'

''మిమ్మల్ని ఖాళీచెయ్యమనడానికి బాధగా వుంది'' అన్నాడు పానకాలు.

''ఏం చేస్తాం — అవసరం అలాంటిది.'' నీరసంగా అన్నాడు శేషగిరి.

''నువ్వు అర్థంచేసుకునేవాడివి కావటం నా అదృష్టం. అందుకే, ఈ నెల అద్దె యివ్వద్దు. నేనూ ప్రయత్నిస్తాను నీకోసం మరో మంచి యింటికోసం. నెలాఖరులోగా దొరుకుతుందనుకుంటాను.''

''దొరకొచ్చు. ప్రయత్నిస్తాను.'' శేషగిరి గొంతు నూతిలోంచి వచ్చినట్టు ధ్వనించింది.

* * *

శేషగిరి యింటికోసం అతనికన్న పానకాలే ఎక్కువ శ్రమపడ్డాడు. చివరికి వూరికి కాస్త దూరంలో ఒకమాదిరిగా వున్న పోర్షన్ నూటయాభైకి దొరికింది.

''పాతిక అద్దె తగ్గిందన్నమాటేగానీ, యిల్లు అంత సౌకర్యంగా లేదండీ! పైగా,



ఏ కన్ను నొచ్చినా, కాలు నొప్పినా సాయం తెచ్చుకుందికి బ్రాహ్మణ పొరుగు కూడా కాదు..." అంటూ సణిగింది సావిత్రి.

"ఏంచేస్తాం చెప్పు. పాపం, అనుకోని ఆపద వచ్చిందతనికి మరి. మనం సమయానికి యిల్లు ఖాళీ చేసి యివ్వకపోతే అవతల అతని పెద్దమ్మగారి కుటుంబం ఎంత బాధపడాలి —" సముదాయించాడు శేషగిరి, "అందుకే ఏదో ఓ యిల్లు దొరికిందే చాలని ఖాళీ చేయటం! మరీ ఇబ్బందిగా వుంటే తీరికమీద మరో యిల్లు చూసుకుందాంలే!"

ఫస్టుకల్లా వూరి చివరి యింట్లోకి మారిపోయారు వాళ్లు. వెళ్లే రోజున పిండి వంటలతోసహా భోజనం పెట్టి, కన్నీళ్లతో వీడ్కోలిచ్చింది సుందరి. శేషగిరికీ, సావిత్రికీ ఎవరో ఆత్మీయుల్ని వదిలి, ఎక్కడో సుదూర తీరాలకి వెళ్లిపోతున్నట్టే భావన కలిగింది.

* * *

మరో నెల గడిచింది. 'మీ పెద్దమ్మగారి ఫామిలీ వచ్చారా' అంటూ గడిచిన నెల రోజుల్లోనూ రెండు, మూడు సార్లడిగిన శేషగిరితో 'ఇంకా రాలేదనే' జవాబిచ్చాడు పానకాలు. అందుకేవో కారణాలు కూడా ఏకరువు పెట్టాడు.

ఆ రోజు సాయంత్రం ఇంటికి వచ్చిన శేషగిరిని భార్య వైఖరి కలవరపెట్టింది. అంతటి ముభావం భార్య కాపురానికి వచ్చిన యీ ఏడాదిలోనూ ఎప్పుడూ చూడలేదతను.

"ఏమయింది సావీ, ఏమిటలా వున్నావ్?" అంటూ అడిగేడు.

"మీ పానకాలుగారి పెద్దమ్మా వాళ్లు వచ్చారుటా?" సావిత్రి ప్రశ్నలో ఏదో వ్యంగ్యం ధ్వనించింది.

"పోయిన వారంలో అడిగాను. ఇంకా రాలేదుట. అక్కడి పొలాలూ, అవీ అమ్మేసుకు రావటంలో ఆలస్యం... ..."

"ప్రతివాళ్ళనీ గుడ్డిగా నమ్మేస్తాం మనం! అందర్నీ స్నేహితులే అనుకుంటాం. మన వెనక వాళ్ళే ఎలాటి గోతులు తవ్వుతున్నారో మనకి తెలీదు..." అతణ్ణి మధ్యలోనే ఆపి, అంది సావిత్రి.

తెల్లబోయాడు శేషగిరి.

"ఏం. ఇవాళేమయింది నీకు — నామీద అలా విరుచుకుపడుతున్నావ్?" అడిగాడు ఆశ్చర్యంగా.

"ఇవాళ మధ్యాహ్నం ఏమీ తోచక అలా సుందరి వాళ్ళింటికి వెళ్ళాను."

"వెళ్తే?"

"మనముండే వాటాలోకి ఎవరో కొత్తవాళ్ళు అద్దెకి దిగారు!" ఖంగున మోగింది సావిత్రి కంఠం.

"ఆఁ!..." ఉలిక్కిపడ్డాడు శేషగిరి, "కొత్తవాళ్ళు దిగారా? ఒకవేళ వాళ్ళ పెద్దమ్మవాళ్ళేనేమో..."

"కాదు. నేను వాళ్ళతో మాట్లాడాను కదా. మూడొందలకి అద్దెకి దిగారుట!

సుందరిని అడిగాను ఇదేమిటని.

వాళ్ల పెద్దమ్మగారి కోడలికి ఆ ఊళ్ళోనే ఉద్యోగం వుందిట. 'అది వొదులుకురావటం అనవసరమనిపించి, వాళ్ళు యిక్కడికి రావటమే మానుకున్నార'ని చెప్పింది.

అయితే ఆ వాటా మళ్ళీ మాకే యివ్వొచ్చుగా అని అడిగాను. దానికావిడ ఎంత పెడసరంగా మాట్లాడిందో తెలుసా?

'మూడొందల అద్దె భరించే తాహతు వుందొద్దా మీకు?' అనేసింది.

ఎంత అమాయకులమండీ మనం! యెంత అభిమానం చూపేవాళ్ళం వాళ్ళమీద!

అద్దె ఒక్కసారిగా రెట్టింపుచెయ్యటం కోసమే మనకి అబద్ధం చెప్పి ఖాళీ చేయించారు..."

హఠాత్తుగా సావిత్రి గొంతులో దుఃఖం చోటుచేసుకుంది.

"ఛ ... ఛ ... ఏడుపెందుకు ... వూరుకో! పిచ్చిదానా, ఇందులో వాళ్ళ బుద్ధే బయటపడింది. మనం కోల్పోయిందేముంది?

అద్దె పెంచటంకోసమే మనం బంధువులమని చెప్పి, ఏడాది క్రితం మన ముందు వాళ్ళని ఖాళీ చేయించారు. ఇప్పుడు అద్దె పెంచమని మనని అడగటానికి మొగమాటంవేసి వేరేవాళ్ళకి ఇచ్చేశారు..."

"మొగమాటమంటే అర్థం ఏమిటండీ— స్వార్థమా? మొగమాటమే వుంటే మనల్ని అసలు ఖాళీ చేయించేవాళ్ళేనా?" రోషంగా అంది సావిత్రి.

"పోన్లే సావీ, ఇహ ఆ విషయం మర్చిపో. ఇంకెప్పుడూ వాళ్ళింటి వైపే వెళ్ళబోకు..."

బయటికి తేలిగ్గానే అనేశాడుగానీ, తనలో పానకాలుపై రగుల్తున్న ద్వేషాగ్నిని, రేపటినించీ ఆఫీసులో రోజూ కలిసి పని చేయాల్సిన పానకాలు ముందు యెలా చల్లార్చుకుంటూ వుండాలో అతనికి అర్థంకాలేదు!



తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దినపత్రిక పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

# చిగుళ్ల బాధకు తొలి చిహ్నాలు?



**పాచి (Plaque) :** ఇది పళ్లు, చిగుళ్ల చుట్టూ ఎల్లప్పుడూ ఏర్పడే కంటికి కనపడని సూక్ష్మ జీవుల పొర. అయితే దీన్ని అశ్రద్ధ చేసినట్లయితే పళ్లు గారకడతాయి.

**గార :** ఇది పళ్ల మొదళ్లలో పేరుకుని చిగుళ్లకు మంట పుట్టించి వాటిని వాచేటట్లు చేస్తుంది. తర్వాత చిగుళ్లు, ఎముక కుదించుకుపోయి పళ్లు పట్టు తప్పి పడిపోవచ్చు.

**చిగుళ్లనించి రక్తం కారడం :** పళ్లు తోముకొనేటప్పుడు బలహీనమైన మెత్తటి చిగుళ్ల నించి రక్తం కారవచ్చు. దీని వల్ల బాధలేక పోయినప్పటికీ చిగుళ్లు రక్తం కారడం, తీవ్రమైనసమస్యలకు దారితీసుంది

## దంతవైద్యుడు సృష్టించిన టూత్‌పేస్ట్ మీకు తోడ్పడనివ్వండి

**దంత వైద్యులు ఏమంటున్నారంటే**

నియమానుసారంగా పళ్లని బ్రష్ చేసుకోవటం, చిగుళ్లని మాలిష్ చేసుకోవటంవల, చిగుళ్ల బాధల్ని, దంతక్షయాన్ని అరికట్టవచ్చు.
కనుక ఫోర్‌హెన్స్ టూత్ పేస్టుతో ఫోర్‌హెన్స్ డబుల్ యాక్షన్ టూత్‌బ్రష్‌తో రాత్రి పొద్దున్న మీ పళ్లని బ్రష్ చేసుకుని చిగుళ్లని మాలిష్ చేసుకోండి.

**డాక్టర్ ఫోర్‌హెన్స్‌యొక్క ఫార్ములా**

డాక్టర్ ఫోర్‌హెన్స్ యొక్క ఫార్ములాలోని కందరాన్ని గట్టి పరిచే శక్తివంతమైన చర్య చిగుళ్ల పైభాగాన్ని దృఢపరచి, చిగుళ్ల బాధలు నివారించటానికి తోడ్పడుతుంది. ఫోర్‌హెన్స్‌తో బ్రష్‌చేసుకున్నట్లయితే మీ నోరంతా శుభ్రంగా, తాజాగా, ఆరోగ్యవంతంగా ఉంటుంది.

కాంతివంతమైన నారింజరంగు ప్యాక్‌లో






చిగుళ్ల బాధలు అనారోగ్యానికి దారితీస్తాయి

**ఉచితం!** "పళ్లు, చిగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ." దంత సంరక్షణ గురించిన సమాచారాన్నందించే రంగుల పుస్తకం. పోస్టు ఖర్చు కోసం 25 పైసల స్టాంపు జతపరుస్తూ దయచేసి ఈ చిరునామాకు వ్రాయండి. ఫోర్‌హెన్స్ డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్ట్ బేగ్ నం. 11468, డిపార్ట్‌మెంట్ P 135-203, బొంబాయి 400 020. ఏ భాషలో కావాలో వ్రాయండి.

## ఫోర్‌హెన్స్
### దంతవైద్యునిచే సృష్టింపబడిన టూత్‌పేస్టు

# నళిని

### చిట్టారెడ్డి సూర్యకుమారి

*(గత సంచిక తరువాయి)*

సూర్యుడు పశ్చిమాద్రిని అస్తమించనున్నాడు. అయినా తీక్షణంగానే వున్నాడు. నళిని గదిలోకి వెళ్ళి కూలింగ్ గ్లాసెస్ పెట్టుకుని వచ్చింది.

"మహాలక్ష్మి ఇంట్లో మల్లెపూలు వుంటే పట్టుకునివస్తా" నంటూ వాసవి వెళ్ళబోయింది.

"ఇంత ఖాళీ స్థలం వుంది. మల్లెపందిర్లు వేయలేదేం ?" ప్రశ్నించింది నళిని.

"పశువులు వుండనిస్తే గదా! మహాలక్ష్మి ఇంటి పెరట్లో పందిరిపైకి అల్లుకుంది గనుక పశువుల బెడద తప్పి" అంటూ సమాధానం చెప్పి, పూలసెజ్జ పట్టుకుని బయలుదేరింది వాసవి.

సూర్యుడు నించిన కొండ పసిడి రంగులో మెరిసిపోతున్నది. పరిసర ప్రదేశాలు పంట మొక్కలతో పచ్చగా కనువిందు చేస్తున్నవి. చిరుగాలులు వీవనకు చిద్విలాసంగా నాట్యం చేస్తున్నట్టు కదులుతున్నాయి వరిమొక్కలు. చిగురాకుల మంజుల స్వనాలు సప్తస్వరాలను పలికిస్తున్నట్టు వీనుల విందు గావిస్తున్నాయి. పెట్టగోడపై కూర్చుండి అలాగే చూస్తుండి పోయింది. చేరువలో వినపడిన అలికిడికి తల త్రిప్పి చూచింది. ఒక నవయువ్వనుడు ప్యాంట్ జేబులలో చేతులుంచుకుని ఠీవిగా నిల్చుని తనవైపే చూస్తున్నాడు. పాతికేళ్ళకు తక్కువ కాని వయస్సు, ఆరడుగులకు మించని ఎత్తు, ఎత్తుకు తగ్గ లావు, నల్లటి ఉంగరాల జుట్టును అందంగా దువ్వి, ముంగురులు విశాలమైన నుదుటిపై గాలికి లాస్యం చేస్తున్నాయి. ఆ చిన్నటి కళ్ళలో సందేహాస్పద దృక్కులు గోచరిస్తున్నాయి. దీర్ఘ నాసిక క్రింద సన్నని మీసం, చిరుదరహాసంతో విడివడిన అధరాలు అందంగా వున్నాయి. చామన ఛాయలో వున్న ఆ సుందర విగ్రహానికి వుల్ వైట్ స్లాక్ పై లైట్ బ్లూ కలర్ ప్యాంట్ 'టక్' చేయడంవల్ల అందాన్ని ఇనుమడింపజేస్తున్నది.

"ఎక్స్‌క్యూజ్‌మి..." సందేహిస్తూ పలుకరించాడతను.

"ఇది ఈ ఇల్లు..."

సమాధానం చెప్పి అతని సందేహ నివృత్తి చేసింది నళిని.

"నా పేరు మోహన్"

ఆనందంతో తడబడింది ఒక్క క్షణం.

'అరె... అక్కడే నిల్చుండిపోయారు. రండి" అంటూ ఆహ్వానించింది.

ఎరగని ఈ అందాలరాశిని గురించి ఆలోచించ సాగాడు మోహన్! అంతకు మునుపెక్కడా చూసిన జ్ఞాపకం లేదు. కాని పరిచయస్తురాలిలా మాట్లాడుతూ ఆహ్వానిస్తుంటే విస్తుబోయాడు. ఎవరీ లమ్మాయి ! వాసవియేనా! వాసవిలో ఇంత మార్పా ? లీలగా గుర్తున్న వాసవి ఆకారానికి తన ఎదుటి సౌందర్యరాశికి పోలిక లేదు. వాసవి కాదని మనోవాణి పలుకుతున్నది.

"లోపలికి రండి! అమ్మా ఎవరొచ్చారో చూడు" అంటూ ఇంట్లోకి దారితీసింది నళిని.

"ఎవరూ !" అంటూ ఎదురుగా వచ్చింది చింతలమ్మ.

"మోహన్ ! నువ్వా! రావయ్యా" అంటూ ఆదరంగా పిలిచింది.

కాళ్ళకు నీళ్ళిచ్చి కుశల ప్రశ్నలు వేసింది.

నిర్భయంగా తనముందు తిరుగుతున్న ఆ అమ్మాయిని గురించి ఆలోచిస్తూనే వున్నాడు. చివరకు వుండలేక అడిగేశాడు.

"మీరు..."

"హంసడిభకులు"

అయోమయంగా చూశాడతను.

"పేరెప్పుడైనా విన్నారా ?" ప్రశ్నించింది.

"విన్నట్టేవుంది... కాని.. " నసిగాడు.

"కాని... పోల్చుకోలేరు."

"కరెక్ట్."

"అదేం కుదరదు. నేనెవరినో మీరెవరిని అడగకుండా తెలుసుకోవాలి."

"ఐసీ! టెస్ట్ పెడుతున్నారన్నమాట."

"ఎగ్జాట్లీ!" కనుక్కోండి చూద్దాం.

ఇంతలో పూలసెజ్జతో లోపలికి వచ్చింది వాసవి; నళినిని పిలుస్తూ! నళినితో మాట్లాడుతున్న వ్యక్తిని చూసి కాస్త వెనక్కి తగ్గింది. మోహన్ వెనుదిరిగి చూశాడు. సిగ్గుతో ప్రక్కకు తప్పుకున్న వాసవిని గుర్తుపట్టాడు.

"సో! మీ పేరు నళిని. ఒప్పుకుంటారా !"

"భలే కనిపెట్టేశారే" అపహసించింది నళిని.

"ఐ యామ్ ఫారెస్ట్ ఆఫీసర్! మాటను, చేతనుబట్టి మనిషిని కనిపెట్టగలను" బింకంగా పలికాడు.

'ఓహో... మీరు 'అడవి మనిషన్న' మాట. గట్టిగా నవ్వుకుంటూ లోపలికి తుర్రుమంది.

నళిని చిలిపితనానికి లోలోన నవ్వుకుంటూ అలాగే వుండిపోయాడు కాసేపు మోహన్.

దీపాలు వెలిగించే వేళకు రాఘవయ్యగారు వచ్చారు. కుశల ప్రశ్నలతో అల్లుడిని పరామర్శించి కొంతసేపు గ్రామ విశేషాలను ముచ్చటించుకున్నారు. ఆ తరువాత అల్లుని ఉద్యోగ విషయాలను గురించి అడిగి తెలుసుకున్నారు.

చిత్తూరుకు ట్రాన్స్‌ఫర్ అయ్యిందని, జాయినింగ్ టైంలోగా అందరిని చూసి వెళ్ళుదామని వచ్చానని చెప్పాడు మోహన్.

**జరిగిన కథ-2:** తమ కాలేజీ చదువు పూర్తిగించుకొని బయటపడ్డారు వాసవి, నళినిలు. తరువాత వాసవితో కలిసి వాళ్లవూరు వెళ్తుంది నళిని. అక్కడి ఆహ్లాదకరమైన గ్రామీణ వాతావరణానికి పరవశించిపోతుంది.

కొందరు అనతికాలంలోనే అతిచేరువవుతారు. మరికొందరు ఎంతో కాలంగా కలిసి తిరిగినా సన్నిహితులు కాలేరు. దీనికి కారణం వెదికితే — అనేకం అగుపించవచ్చు ఆ సన్నిహిత్యం వ్యక్తుల అభిప్రాయాలు, మనోభావాలనుబట్టి మారుతుంటుంది. జీవితంలో దృఢపడి విడరాని బంధం కావచ్చు. లేక ఆదిలోనే అంతం గావచ్చు.

పరిచయమైన కొన్ని గంటల్లోనే మోహన్ మనసు నాకట్టుకుంది నళిని నవ్వుతూ, నవ్విస్తూ తిరిగే ఆమెను చూచి హృదయం మెత్తగా స్పందించేది. మనసు మూగగా మధురగీతం పాడేది.

రాత్రి భోజనాల తరువాత అందరూ డాబా పైకి వెళ్ళారు.

అల్లుడికి పడకమంచంపై ఏర్పాటుచేశారు.

బంధుమిత్రుల వివరాలపై కాసేపు చర్చ సాగింది.

చిన్నన్నయ్య వాసవి, నళినీల దగ్గరకు వెళ్ళి కూర్చున్నాడు.

"అన్నయ్యా! ఒక పాట పాడవూ ?" గోముగా అడిగింది నళిని.

"ఏ పాట పాడమంటావు చిట్టితల్లీ !"

"నీ కిష్టమైన పాట."

"అది నీ కిష్టమవుతుందా ?"

"ఎందుక్కాదు ?"

"అయితే పాడతాను."

గొంతు సవరించుకుని, ఒక చేతితో చెవిని మూసి వదినెకేసి ఒక చేతిని చూపెడుతూ ---

"చూడుమదే చెలియా" అని రాగం అందుకున్నాడు.

వదినె మూతి ముడుచుకుంటే, అతని అభినయానికి అందరు నవ్వుకున్నారు.

తరువాత కొన్ని డ్రామా డైలాగులు చెప్పమంటే, చెప్పతూ తన హావభావాలను ప్రదర్శించాడు. ఆ రాత్రి అందరు నవ్వుకుంటూ, అలాగే నెమ్మదిగా నిద్రలోకి జారుకున్నారు.

* * *

ఏలాంటి ఇతర ఎంటర్‌టైన్‌మెంట్స్ లేకపోవడంతో నాలుగు రోజులు గడిచేసరికి కాస్త 'బోర్' కొట్టింది గ్రామీణ జీవితం ఇద్దరికీ.

"వాసవీ!" పిలిచింది నళిని.

"ఊఁ"

"ఏం తోచడంలేదు కదూ!"

"ఊఁ"

"నెక్స్ట్ మన ప్రోగ్రాం ఏమిటి ?"

... ... ... ...

"అమ్మాయిగారు ఏదో ఊహాలోకంలో ఊగుతున్నట్టున్నారు!" చేయి పట్టి కదిపింది.

"అబ్బే! ఏంలేదు" తడబడుతు జవాబిచ్చింది వాసవి.

"ప్రశ్నకు జవాబు లేదా ?"

"లేదు... కాదు... తత్తరపడింది."

"ఫోజు కొట్టకమ్మాయ్! నీ మనసెక్కడ విహరిస్తున్నదో నాకు తెలుసుగాని, అయ్యగారిని కాస్త కదిపి త్వరగా ఆ మూడు ముళ్ళు

సెయించుకోరాదూ? ఈ అవస్థ వుండదుగా?''

''యూ...నా...టీ'' గట్టిగా బుగ్గను గిల్లింది వాసవి.

''బాప్‌రే – చచ్చాము'' అరిచింది నళిని

నవ్వుతూ వదిలింది వాసవి.

''అబ్బ ఎంతటి నెరజాణవే!''

''నా బుగ్గ కాదు డియర్! బావగారి బుగ్గ గిల్లి చూడు, సరైన రియాక్షన్ వస్తుంది.''

''అదిగో... మళ్ళీ...'' సిగ్గుతో, కోపం అభినయించింది.

''నళినీ'' మోహన్ పిలిచాడు.

ఇద్దరూ లేచి అతని కెదురుగా నిలబడ్డారు.

''లేపాక్షి ప్రోగ్రాం వేస్తున్నాను. రాదలచు కున్నవారు త్వరగా రెడీ కండి! బయలుదేరదాం.''

# నళిని

''థాంక్యూ బావా! ఏం తోచక ఛస్తున్నాం. వన్ మినిట్! ఇప్పుడే తయారవుతాం!'' చిటికె వేస్తూ ఇంట్లోకి పరుగెత్తారిద్దరూ.

అలాగే వారివైపు చూస్తూ చిన్నగా నవ్వు కున్నాడు.

అల్లుని కోరికపై, తెలిసిన ఒక సాపన్నుడి నడిగి జీపు ఏర్పాటు చేయించారు రాఘవయ్యగారు.

వాస్తాబు ముగించేసరికి ముప్పావుగంట పట్టింది.

''ఐదు నిమిషాలంటూ, అరగంట అలంక రించుకుంటారీ ఆడవాళ్ళు'' ఎగతాళి చేస్తూ పలికాడు మోహన్.

''మగరాయుళ్ళకు మాదిరి ప్యాంట్, షర్ట్ అయితే పది సెకండ్లు చాలు మరి.'' నళిని త్రిప్పి కొట్టింది.

''వై నాట్? ఇప్పుడు లేటెస్ట్ ఫాషన్ అదేగా! మీరు కూడా ఈ చీరెలు వదలి బెల్, స్లాక్ తగిలించుకోరాదూ?'' హాస్యంగా పలికాడు.

''డెఫనెట్లీ! మీ మగధీరులందరు చీరెలు, లంగాలు కట్టడం మొదలుపెడితే!''

''యూ... సిల్లీ గర్ల్'' పెదవి నొక్కిపట్టి పలుకుతూ జీపు వద్దకు నడిచాడు వెనుక వాసవి, నళినీలు అనుసరించారు

జీపులో అప్పటికే చిన్నన్నయ్య, వదిన, వెనక సీట్లో కూర్చున్నారు. శకుంతలమ్మ పురమా యింపుతో పనిపిల్లవాడు కూడా జీపులో వెనక



చూస్తున్నారు. మోహన వెళ్ళి డ్రైవింగ్ సీట్‌లో కూర్చున్నాడు.

నువ్వంటే నువ్వంటూ కాసేపు త్రోసుకున్నాక చివరకు నళిని ఫ్రంట్ సీట్‌లో మోహన్ ప్రక్కన కూర్చున్నది.

తరువాత వాసవి ఎక్కి కూర్చున్నది.

జీపు స్టార్ట్ చేశాడు మోహన్. వరండాలో చూస్తూ నిల్చున్న రాఘవయ్య, శకుంతలమ్మ చేతులెత్తి వూపుతూ వీడ్కోలిచ్చారు. కనుమరుగయ్యేవరకు నిలబడి తృప్తిగా నిట్టూర్చుతూ లోపలికి వెళ్ళారు.

''ఫరవాలేదు బావగారు మంచి డ్రైవరేనే!'' వాసవితో అందరికి వినిపించేలా అన్నది నళిని

వాసవి నవ్వుతూ నోటికి అరచేతిని చేర్చింది.

''గుర్రంకొద్దీ రౌతన్నట్టు, బండిని పట్టి లాఘవంగా నడపాలి మరదలా.''

''తమరు దయతోడ ఈ శిష్యురాళ్ళకుకూడ 'వాహన చోద విద్య'ను నేర్పండి గురూజీ!'' చేతులు జోడించి అతి వినయాన్ని ప్రదర్శించింది.

''ఉచిత విద్య ఉపకరించదమ్మాయిగారూ! గురు దక్షిణ కావాలి'' బెట్టుగా పలికాడు మోహన్

''ప్రతిఫలం ఆశించి నేర్పే విద్య పారదు గురూజీ!''

''ఫరవాలేదు. భక్తితో అర్పించేదాన్ని పరిగ్రహించడంలో తప్పులేదు.''

''ఓ...కే! అలాగే ఇస్తాం! ముందు మీరు పాఠం మొదలెట్టండి''. మోహన్ వైపు తిరిగి రెండు చేతులతో స్టీరింగ్ పట్టుకున్నది. అతని చేతివ్రేళ్ళను ఆమె తాకుతున్నది. తెలియని పులకింతలేవో కలిగినవి మునుపెన్నడు కలుగని నవ్యానుభూతి. సూటిగా నళిని కళ్ళలోకి చూశాడతడు.

అతని చూపులకు ఒక నిమిషం మనసు కలవరపడింది.

''ఏం చెల్లెమ్మా! మమ్మల్ని తిరిగి ఇంటికి క్షేమంగా చేరుకోనీయవా?'' నవ్వుతూ పలికాడు చిన్నన్నయ్య.

ఛలోక్తులలో నవ్వుకుంటూ ప్రయాణం సాగించారు. అప్పుడప్పుడు అన్నయ్య కూనిరాగాలు తీస్తూ మిగిలినవారిని శ్రోతలను చేస్తున్నాడు. జీపు గమ్యస్థానం చేరుకుని రహదారి బంగళా ముందు నిలిచింది

''అప్పుడే వచ్చేశామా'' అంటూ దిగారందరు

వాచ్‌మాన్ వచ్చి బంగళా తలుపులు తెరచి జీపులోని సూట్‌కేసెస్ వగైరాలు లోపలికి పట్టుకెళ్ళాడు. పనిపిల్లవాడు తినుబండారాలు సర్దిన బుట్టను తీసుకుని వెళ్ళాడు అతని వెనుక.

టవల్, సోప్ బాక్స్‌తో బాత్‌రూమ్‌కేసి నడిచాడు మోహన్. ముఖాలు కడుక్కొని అందరూ వరండాలో వచ్చి కూర్చున్నారు. కాస్త ఫ్రెష్‌గా ఫీలయ్యారు. తరువాత ఫలహారం, టీ తీసుకున్నారు. వేసవికాలం గనుక సాయంకాలం నాలుగు గంటలు దాటినా ఎండ తగ్గలేదు.

వాసవి, నళిని అంత చనువుగా మోహన్‌తో మాట్లాడలేకపోతున్నది. తన ప్రక్కన బావను ఊహించుకుంటే సిగ్గుతో కుంచించుకుపోయేది. ఎవరైనా పలుకరించవలసివస్తే తడబడిపోయేది

ఆమె అవస్థను అర్థం చేసుకున్న మోహన్ లోలోపల నవ్వుకునేవాడు. నళిని చాటుగా వుండి బావను చూసుకునేది.

మోహన్ సూట్‌కేసులోంచి బైనాక్యులర్స్, కెమేరా బయటికి తీశాడు. బంగళాకు అనతి దూరంలోనే బసవేశ్వరుడి విగ్రహం వున్నది. వరండాలో నిలబడి బైనాక్యులర్స్ లెన్స్ సరిజేస్తూ విగ్రహంకేసి చూడసాగాడు.

''ఏమైనా అగుపించిందా బావగారూ?'' అడిగిందె నళిని.

''చూడరాదూ!'' అంటు బైనాక్యులర్స్ చేతికిచ్చాడు.

అందరు చూశాక విగ్రహం వద్దకు నడిచారు.

రావిచెట్టు క్రింద పడుకున్న బసవేశ్వరుడి విగ్రహం చూడముచ్చటగా వుంది. ఒక బండరాతికి శిల్ప విద్యచే ప్రాణం పోసి అమరుడైనాడు శిల్పి. అందరు విగ్రహంచుట్టూ ముమ్మారు ప్రదక్షిణాలు గావించి, భక్తితో నమస్కరించారు. తల ఎత్తి విగ్రహంకేసి చూస్తున్న వాసవి 'ఎత్తు ఎంత వుంటుందో' అని అడిగింది.

''ఇరవై ఏడడుగులు'' ప్రక్కనే వున్న మోహన్ చెప్పాడు.

తల త్రిప్పి బావకేసి చూసింది.

చిన్నగా నవ్వాడతను.

బైనాక్యులర్స్ లెన్స్ సరిజేసి గుట్టమీద వున్న దేవాలయంకేసి ఫోకస్ చేశాడు.

''అదిగో ఆ గుట్టమీద అగుపిస్తున్నదే లేపాక్షి దేవాలయము'' అంటూ నళిని కిచ్చాడు బైనాక్యులర్స్

''అలా ఆ చెట్టు దగ్గర చూడు.''

నళిని బైనాక్యులర్స్‌తో చూసింది

''ఏం అగుపించడంలేదు.''

''లెన్స్ అడ్జెస్ట్ చేయాలి'' అంటూ నళిని భుజాల మీదుగా వంగి లెన్స్ సరిచేసి ఇచ్చాడు.

''అగుపిస్తున్నదా?'' ప్రశ్నించాడు.

''ఆఁ... దేవాలయం వెనుక సప్త శిరస్సుల

> ది
>
> న
>
> **ఆంధ్రపత్రికలో**
>
> ప్రతి
>
> **కలో**
>
> * నారీ దృక్పథం
> * డాకరు కబుర్లు
> * గ్రంథ సమీక్షలు
> * రామాయణం
> * దేవీ భాగవతం
>
> చదవండి!

నాగేశ్వరుడి విగ్రహం అగుపిస్తున్నది.'' అలాగే చూస్తూ వుండిపోయింది.

''ఎంతసేపు చూస్తావే'' నళిని చేతుల్లోంచి బైనాక్యులర్స్ లాక్కుంది వాసవి.

ఏమీ అగుపించలేదు మోహన్ వెనుక నిల్చొని ఫోకస్ చేసి ఇచ్చాడు. తరువాత శారద, చిన్నన్నయ్యలు చూశారు. అందరూ దేవాలయం వైపు నడిచారు. ఇళ్ళ మధ్యగా దేవాలయానికి చిన్న దారి వుంది

''పూర్వం గుడినుండి ఇక్కడి వరకు సప్త ద్వారాలు వుండేవట. ఇప్పుడు ఇళ్ళు కట్టేశారు'' చెప్పాడు మోహన్.

పనిపిల్లవాడిచేత పూలు,కాయలు తెప్పించారు.

ఎత్తైన మెట్లను ఎక్కి దేవాలయ ప్రాంగణంలోకి చేరుకున్నారు. అప్పటికే చిన్నన్నయ్య, వదిన గైడును వెంటబెట్టుకుని, అతడు వివరిస్తుంటే ఆలయ ప్రాకారంకేసి చూస్తూ నిల్చున్నారు.

''మీరు వినేవుంటారు. ఈ దేవాలయం 16వ శతాబ్దంలో విజయనగరరాజు అచ్యుత దేవరాయల కాలమున నిర్మింపబడినది. పెనుకొండ మండలాధికారి విరుపణ్ణ తన ఇష్టదైవం శ్రీ వీరభద్రస్వామికీ ఆలయం నిర్మించాడు.'' గైడ్ ఆలయ విశేషాలను వివరిస్తూ చెబుతున్నాడు

ప్రాకారాలపై సింహం తలలు రాతిలో అందంగా మలచబడ్డాయి. ఆలయ గోడలపై కన్నడ లిపిలో నాటి శాసనాలు చెక్కబడ్డాయి

''ఈ కొండ పేరు కూర్మశైలము. ఈ క్రింద పడిన కాంక్రీట్‌ను చూడండి. ఆలయ నిర్మాణమప్పుడు పడినదిది ఇందులోంచి ఒక చిన్న రాయిని సైతం తీయలేరు వజ్రముకంటె కఠినమైనదిది''

నళిని, వాసవి రాయిని తీయ ప్రయత్నించారు. సాధ్యపడలేదు వారి చేష్టలకు మోహన్ నవ్వుకున్నాడు

''ఇంకా బయటే వుండిపోతె ఎలా? చాలా చూడాలి. లోపలికి నడవండి.'' హెచ్చరించాడు. మోహన్

''వీరభద్రస్వామికి కోపమెక్కువంటారు ఆ కోపానికి గురికాకుండ, ప్రదక్షిణచేసి నేరుగా గాక, వెనుక ద్వారం గుండా రావాలి'' అంటూ అటువైపు దారితీశాడు గైడ్. అందరూ అతడి ననుసరించారు.

''ఆ మందిర శిలల కేర్పరచిన రంధ్రాలను చూడండి. వాటిలో దీపాలను వ్రేలాడదీసేవారట!''

''చూసినట్టు చెప్పుతున్నాడేయ్.'' నళిని వాసవి చెవిలో చిన్నగా చెప్పింది.

''అటు చూడండి. విరిగిన ఏకదంతం గల చవితి గణపతి! సర్పమును బొజ్జ చుట్టూ చుట్టుకున్నాడు.''

శారద భక్తితో నమస్కరించి చెంపలు వేసుకుంది.

''మొదట విఘ్నేశ్వరుని విగ్రహం మలిచిన తరువాతే ఆలయ నిర్మాణం ప్రారంభించారు''

# నళిని

అలా కనిపిస్తున్న ప్రతి శిలపై ఎన్నో శిల్పాలు చెక్కబడి వున్నాయి.

''ఈ శిలపై శ్రీ కాళహస్తీశ్వర మహాత్మ్యం బొమ్మలు చూడండి! ఒక పుణ్యక్షేత్రం దర్శించే యాత్రికులు మొత్తం మూడు పుణ్యక్షేత్రాలను దర్శించి గమ్యస్థానం చేరుకోవాలట. అలా అందరికి వీలుపడకపోవచ్చుననే భావనతో యితర క్షేత్రాల దృశ్యాలిచట చిత్రీకరించడం జరిగింది. ఇవి సప్తమాతృకేయులు. అక్కచెల్లెళ్ళు. ఆ అగుపించునదే సప్తఫణి నాగేశ్వర శిల్పము. దీనికొక కథ వున్నది. ఆరోజు పండుగదినం. శిల్పుల తల్లి వంట కార్యక్రమంలో వుంది. భోజన సమయానికి శిల్పులు వచ్చారు. వంట పూర్తికాలేదు. ఇంకా ఆలస్యము అవుతుందన్న విషయము గ్రహించి చేరువలో నాగరూపముగా వంగి వున్న ఒక శిలను చూసి ఈ సప్తఫణి నాగవిగ్రహమును మలిచారు. వంట పూర్తిచేసి బయటకు వచ్చిన శిల్పుల తల్లి మనోహరమైన ఆ విగ్రహంకేసి అలాగే చూస్తూ వుండిపోయింది. 'ఎంత బాగా చెక్కారు' అని అనుకుంది. ఆమె దృష్టి తగిలి నాగభరణం చిట్లిపోయింది.'' కథ ముగించాడు గైడ్. శ్రద్ధగా విన్నారు శ్రోతలు.

మోహన్ బైనాక్యులర్స్ తీసి క్రిందివైపుకు చూశాడు.

''ఇక్కడి నుండి చూస్తే బసవేశ్వరుడు కనిపిస్తాడు.''

నళిని బైనాక్యులర్స్ లాక్కుని అటువైపు చూసింది.

''బసవేశ్వరుడి ముఖం అటువైపే చూస్తున్నట్టు కొద్దిగా వంగి వుంది కదూ!'' అన్నాడు మోహన్.

అవునన్నట్టు తలూపింది నళిని.

నళిని చేతిలోంచి వాసవి తీసుకుని చూసింది.

''బావా కెమెరా తీసుకొచ్చారుగదా! డమ్మీ కెమెరానా? లేక రీల్ ఖర్చవుతుందనా!'' అపహసించింది నళిని.

''ఓహ్ మరచిపోయాను. గెట్ రడీ'' అంటూ నాగేశ్వర విగ్రహం దగ్గర ఫోటోలు తీశాడు మోహన్.

తరువాత అలా ప్రక్కకు కదిలారు.

''ఇది గిరిజా కళ్యాణమంటపం. అసంపూర్తిగా వుండిపోయింది.'' చెప్పాడు గైడ్.

స్తంభాలపైన పార్వతి శిల్పం, మృదంగం, వీణ మొదలగు సంగీత వాయిద్యాలతో గానం చేస్తున్న యక్షులు, గంధర్వుల శిల్పాలు, అష్టదిక్పాలురు వారి వాహనాలపై ఆయుధాలను చేతబట్టి హావభావాలను ప్రదర్శిస్తున్నట్టు ఎక్కగా చెక్కారు శిల్పులు. ఇంద్రుని ముఖం శాంతంగా వుంది. అగ్నికి రెండు తలలున్నాయి. యముని ముఖం గంభీరంగా వుంది. గోపీచందనంతో వసిష్ఠుడు, మకర వాహనంపై వరుణుడు, బృహస్పతి చేతిలో పంచాంగం వుంది. దత్తాత్రేయునికి మూడు తలలు, జింక వాహనంపై

వాయుదేవుడు ఆవైపు పరమేశ్వరుడు పార్వతి హస్తాన్ని ప్రేమగా పట్టుకున్నాడు. రంభ, ఊర్వశి మొదలగు అప్సరసలు వివిధ నాట్య భంగిమల్లో కనిపిస్తున్నారు.

అలా చూస్తూ వస్తున్న వారికి ఒక గోడపైని రక్తపు చారలను చూపించాడు గైడ్.

''ఇవి విరుపణ్ణాగారి కన్నులు తల్లీ! విరుపణ్ణ రామరాయల అనుజ్ఞ లేకుండానే ఈ కళ్యాణ మంటప నిర్మాణం ప్రారంభించారు. రాజకీయ పార్టీల కక్షల ఫలితంగా కలతలు చెలరేగాయి. రాజానుమతి లేకుండ స్వతంత్రించి చేసిన ఈ పనికి తనకేమి శిక్ష పడనున్నదోనని ఆందోళన చెందాడు విరుపణ్ణ. 'వారి ద్రవ్యాన్ని వెచ్చించి ఈ కళాసృష్టిని సృష్టించి ఆనందించిన ఈ కన్నులు ఈ కళకే అంకితం కావాలంటూ' తన రెండు కళ్ళను తీసివేసుకున్నాడు. అక్కడే ఆ కళ్ళు పడ్డాయి.'' ఆ రక్త చారలకేసి చూపించాడు.

''1930 సం.లో అక్కడ పరీక్షించగా రక్తకణాలు కనిపించాయట.''

'నిజమా' అన్నట్టుగా మోహన్ వైపు చూసింది నళిని.

'ఏమో' అన్నట్టుగా భుజాలెగురవేశాడు మోహన్.

గైడ్ చెప్పడం ప్రారంభించాడు

''ఆ విషయం తెలుసుకున్న రామరాయలు స్వయంగా యిక్కడికి వచ్చి, ఈ కళావైభవాన్ని చూసి ఆశ్చర్యపోయాడు. దైవకార్యం గావించిన యితడు నిరపరాధి అంటూ విరుపణ్ణను క్షమించాడు. ఆ తరువాత శిల్పులు జక్కన, హంపనలను పని పూర్తిచేయమన్నాడు. కాని సకలమనస్కులైన వారు అందుకు ఒప్పుకోలేదు అందువల్ల ఇది యిలా అసంపూర్తిగా మిగిలిపోయింది.''

ఉయ్యాల మండపం, సోమవార మండపం చూశారు. నేలపై శిల్పుల భోజన ప్లేట్లు తయారుచేయబడ్డవి వాటి సైజునుబట్టి ఆనాటి వ్యక్తుల భౌతికకాయాలను ఊహించుకొనవచ్చు దుర్గాదేవి పాదం బొటనవ్రేలు దగ్గర ఎల్లప్పుడు నీరు వూరుతూ తడిగా వుంటుంది. భీముని పాద కోనేరు చూశారు. రాముడు లంక నుండి తిరిగి వెళ్ళుతూ అక్కడ జటాయువుకు అగ్నిసంస్కారంచేసి లింగ ప్రతిష్ఠాపన చేశాడు.

గైడ్ వివరిస్తుంటే శారద, చిన్నన్నయ్యలు వింటూ నిల్చున్నారు.

నళిని, వాసవి, మోహన్‌లు నాట్యమంటపం లోకి వచ్చారు. అక్కడ రంభ, పరమేశ్వరుడు నాట్యం ప్రారంభించారు. పార్వతి చిరునవ్వుతో చూస్తున్నది. సంగీత విద్వాంసుడు తుంబురుడు వున్నాడు. వెనుక నగ్నంగ ఓరగా నిల్చుని భిక్షుకునికి భిక్షను ప్రసాదిస్తున్న అన్నపూర్ణ అగుపిస్తున్నది. పై కప్పుకు ప్రసిద్ధిచెందిన లేపాక్షి ప్రింటింగ్స్ వున్నాయి 500 సం.ల క్రితం నాటి అపూర్వ కళావైభవాన్ని చాటుతున్న వాటిని చూస్తుంటే నాటి అగణిత శిల్పకళా ప్రావీణ్యతను ఎవరైన ప్రశంసించకమానరు.

పురాణగాథల దృశ్యాలను పెయింటింగ్‌తో చిత్రీకరించారు. మంటపానికి అరవైనాలుగు స్తంభాలున్నవి. అయినా దాని బరువు అధికంగా ఈశాన్య మూలాన వున్న స్తంభముపై ఆధారపడి వున్నది. చిత్రమేమిటంటే ఆ స్తంభము అడుగు భాగమునకు నేలకు మధ్యన ఖాళీ స్థలము వుండి వ్రేలాడుతున్నట్టు అగుపిస్తుంది.

కాని దాదాపు 73 సం.ల క్రితం బ్రిటిష్ పాలనలో ఒక దొరగారు దీనిని చూచి యిలా వ్రేలాడుతుంటే ప్రమాదమని, స్తంభమును దిగగొట్టమన్నాడట. ఆ కార్యక్రమంలో స్తంభము కాస్త వంగిపోయి, నేలకు ఒకవైపు ఆనివున్నదట.

''ఇండియన్స్‌ను ఏమీ తెలియని మూర్ఖుల క్రింద జమకట్టి, యిలాంటి పనులే చేస్తుంటారీ దొరలు.'' వాసవి కామెంట్ చేసింది.

''మన ఇంజనీర్ల పనితనంకంటె, శిల్పుల కళానైపుణ్యం అద్భుతంగా వుంది కదూ.'' చిన్నగా పలికాడు మోహన్.

అవునన్నట్టుగా తలూపింది వాసవి.

''అదిగో అటు చూడండి; ఆ వటపత్రశాయి తైలవర్ణ చిత్రపటాన్ని.''



''ఈ ఒక్క చిత్రపటం చాలు చిత్రకళా విద్య గొప్పతనాన్ని చాటటానికి.'' నళిని అన్నది.

తరువాత వీరభద్రస్వామి ఆలయంలోకి ప్రవేశించారు. ఆలయంలో వున్న దేవతా విగ్రహాలకు నమస్కరించుకుంటు, వీరభద్రస్వామి ముందుకు వచ్చి నిల్చున్నారు. పనిపిల్లవాడు చేతిలోని కొబ్బరికాయ, పూలు అమర్చిన బుట్టను పూజారి కందించాడు. స్వామి విగ్రహం వెనుక గోడ పై భాగాన విరుపణ్ణ దంపతుల చిత్రపటాలు అమర్చారు. పూజారి కొబ్బరికాయ కొట్టి, హారతి ఇచ్చే సమయానికి శారద, చిన్నన్నయ్యలు కూడా వచ్చి అందుకున్నారు దైవదర్శనం చేసుకున్నాక, మహాద్వారం గుండా బయటికివచ్చి, గైడుకు డబ్బు యిచ్చి గెస్ట్‌హౌస్ చేరుకున్నారు.

* * *

తిరుగు ప్రయాణంలో కదిరి మీదుగా వస్తూ, 18 మైళ్ళ దూరములో వున్న ప్రసిద్ధి పొందిన 'అమ్మమ్మ మర్రిమాను'ను దర్శించారు సుమారు ఐదు ఎకరాల భూభాగము నాక్రమించి విస్తరించిన ఆ వటవృక్షాన్ని చూసి విస్మయం జెందారు.

''ఇంత పెద్ద వృక్షమును యింతకు పూర్వమెప్పుడు చూడలేదు'' అన్నది వాసవి

''మద్రాసులోని అడయార్‌నందున్న 'బనియన్‌ట్రీ' మూడెకరాల స్థలము నాక్రమించుకున్నదట. ప్రపంచంలోని పెద్ద వృక్షాలలో అది మూడవదని విన్నాను.'' నళిని అన్నది.

వృక్షం చుట్టూ ప్రదక్షిణలు చేసిన తరువాత, అక్కడే కొంతకాలం గడిపి జీపెక్కారు.

* * *

'అప్పుడే వెళ్ళుతావా! ఇంకా జాయినింగ్ టైం వుందిగా?'' అల్లుడివైపు చూసి ప్రశ్నించారు రాఘవయ్యగారు.

''రేపు మంచిదినం. అందుకే డ్యూటీలో జాయిన్ అవుదామనుకుంటున్నాను.'' సమాధానం చెప్పాడు మోహన్.

''నీయిష్టం. చిత్తూరు దగ్గరేకదా! వీలుచూసుకుని వస్తూవుండు.''

''అలాగే మామయ్యా.''

సూట్‌కేస్‌తో బయలుదేరాడు మోహన్, అందరిదగ్గర వీడ్కోలు తీసుకొని. ఆ ఇద్దరమ్మాయిలు మోహన్ కనుమరుగైయ్యే వరకు చేతులు వూపుతూనేవున్నారు.

ముహూర్తాలేవో చూసుకుని ఆ శుభకార్యం చేస్తే తన బాధ్యత పూర్తిఅవుతుందని తలచింది శకుంతలమ్మ.

* * *

వాసవీ నళినీలు హైదరాబాద్‌కు ప్రయాణం కట్టారు నళినీతో ప్రయాణమవుతున్న కూతుర్ని చూసి బుగ్గలు నొక్కుకుంది. ''ఇన్నాళ్ళు వారింటనే పెరిగి చదువుకున్నావు. రేపో, మాపో పెళ్లి అవుతుంది, మొగుడింటికి వెళ్లిపోతావు. వాసవీ! నిన్ను పెంచిన తృప్తే లేదు. నీవు నాదగ్గర వున్నట్టే లేదు ఈ కొన్నిరోజులైనా అమ్మ దగ్గర వుండు నీకు వండిపెట్టుతాను, నిన్ను చూసుకుంటాను...'' అంది శకుంతలమ్మ.

ఆ తల్లి ప్రేమకు కట్టుబడిపోయినట్లు అసహాయురాలై నళిని దెస చూసింది. నళిని అర్థంచేసుకుంది. కాని ... వాసవి లేకుండ తను ఒక్కతే పోవాలా! ఈ సెలవులన్నీ వాసవి లేకుండ ఎలా గడుస్తాయి అని అనుకుంటే కన్నులు కన్నీళ్ళతో కలకపారిపోయినవి. -

వాసవి నళిని భుజాలు చుట్టేసింది. అలా కరుచుకొని నవ్వుకున్నారు. కన్నీళ్ళు పెట్టుకున్నారు. కబుర్లు చెప్పుకున్నారు.

''వాసవీ! నీ మొగుడు ... అదే ... బావ! మంచివాడు. నీకు తగినవాడు. నాకు నచ్చాడు. నాకు సంతోషమైంది. పెళ్లికి ముందే వచ్చి వాలతాను ఉత్తరం వ్రాయి...''

''నళినీ! వుండిపో.''

''ఉండాలనే వుంది. అక్క రోజుకో ఉత్తరం వ్రాస్తుందికదా రమ్మని. వాళ్ళు హైదరాబాదు వచ్చిన తర్వాత చూడనేలేదు. అటు వెళ్ళి యిటు వచ్చేస్తాను. నీవు లేకుండ నేను మాత్రం వుండగలనా.'' అలా ఒకరికొకరు నచ్చచెప్పుకుని ప్రస్తుతానికే అనుకుంటూ విడిపోయారు.

**[ఇంకా వుంది]**

అన్ని ఉపద్రవాలు. ఎన్నో మహామ్మారి వ్యాధి భయాలు చాలా చాలా గ్రహ కూటమి ప్రమాదాలు, ఇలాంటి వెన్నో మీద పడతాయంటే, హడలి చావని ఆధునిక మానవ జాతిని ముఖ్యంగా ఆంధ్ర దేశంలోని కరీంనగర్ నుంచి కృష్ణా గోదావరి జిల్లాల దాకా వున్న రైతు కూలీ జనాన్ని "యింకేముంది? మిన్ను విరిగి మీద పడిపోతుం దన్నట్లు" హడలగొట్టి చంపిన— అమెరికా అంతరిక్ష వ్యోమశాల "స్కైలాబ్" జులై 11 బుధవారం రాత్రి పది గంటల వేళ, ధగద్ధగాయమానమైన ఉల్కా పాతంగా 'హిందూ మహా సముద్రం"లో 'కాకి రెట్టగా'— అంతరించడంతో— అంతవరకు భయాందోళనలతో చింత అనుభవాలకు లోనవుతున్న సామాన్య జనం— ఒకరి మొహాలొకరు చూసుకుంటికి సిగ్గుపడ్డట్టు తలలు దించుకుని ముసి ముసి నవ్వులు నవ్వుకుని— రేడియోలకు విశ్రాంతి యిచ్చి తాపీగా నిద్రపోయారు.

## స్కైలాబ్ అంతం

స్కైలాబ్ ఆంధ్రదేశంమీద కాకుండా ఆస్ట్రేలియా ఎడారిలోను హిందూ మహాసముద్రంలోను' కూలి పోయింది. పైగా దీనిలో సారఘటు మాలలే వున్నాయట. కాని, యిప్పుడు ''యినుప తెర'' వెనుకనుంచి ప్రయోగింపబడిన రష్యన్ వ్యోమ పరిశోధనాలయం సోల్యూత్–6 పడిపోతుందేమోనన్న అనుమానం మొదలైంది. పోయినేడాది రష్యన్ కృత్రిమ భూ ఉపగ్రహం ఒకటి కెనడామీద పడ్డది. అందులో ధాతుధార్మిక శక్తి గల రేడియమ్ ఉండటంతో అది

# స్కై
# లా
# బ్
# బూ
# చి!



## సోల్యూత్-6 భయం

"ప్రజాపకారి"గా పరిణమించింది — ఈసారి కూడా రష్యన్ వ్యోమ పరిశోధనాలయంలో కూడా "అణు ఘటమాల" లుంటే అది క్రింద పడితే మాత్రం యిబ్బందేనన్న వార్తలు పొక్కుతున్నాయి — కాని రష్యన్‌లు దీన్ని "సముద్రంలో దించేస్తాం" అంటున్నారట! — ఏది యేమైనా అంతరిక్షంలోకి పంపిన పదార్థాలు తిరిగి భూమిమీద "పడటం" యెంత ఆందోళనకరమో గ్రహించి రష్యా, అమెరికాలు మార్గాంతరం ఆలోచించటం మంచిది కదా?

"స్కైలాబ్ బూచి" కలలోకి కూడా రాలేదు. పశ్చిమ ఆస్ట్రేలియాలో కొన్ని ముక్కలు పడ్డా టగని మూడు గదుల నైశాల్యం. 77 టన్నుల బరువున్న 'స్కైలాబ్ బూచి' ప్రధాన కాయమంతా తునాతునకలై కన్యా హిందూ సాగర గర్భంలో కలిసిపోయింది!

### ఆరేళ్ళ అద్భుత యాత్ర

1973లో అమెరికా దీన్ని ప్రయోగించినప్పుడు కానీ, గంటన్నరకోసారి భూమిని చుట్టి వస్తూ యిది అంతరిక్షంలో ఉండి భూమికి 40 వేల దాకా ఫొటోలు తీసి 'నాసా' కేంద్రానికి అందజేస్తున్నప్పుడు కానీ దీని మీద మూడు జట్ల మంది వ్యోమగాములు మొత్తం మీద 9 మంది ఒక జట్టు తర్వాత మరో జట్టుగా సూర్యుణ్ణి, లోకమక్కల్నీ పరిశోధిస్తూ, మొక్కల్నీ, జీవుల్నీ శూన్యంలో పెంచ యత్నిస్తూ గడిపిన 171 రోజుల 13 గంటల 15 నిమిషాల చారిత్రాత్మకమైన శుభ సమయంలో గానీ — స్కైలాబ్ గురించి మామూలు మనిషికి అంత పట్టించుకోవలసిన అక్కరలేకపోయింది! అది 3 లక్షల ఫొటోల మానవుడికి తీసింది సూర్యగోళంలోని అంతు చిక్కని రహస్యాలను ఛేదించడం కోసం — మానవుడు ఆకాశంలోకి పంపిన కొన్ని వేల ఉపగ్రహాలన్నింటిలోను పెద్దది ఐనప్పటికీ "స్కైలాబ్" అద్భుతమైన అపారమైన సేవ చేసింది!

ఇది యిప్పుడు కాకపోయినా 1983లో నైనా కూలిపోవలసిందే. కాకపోతే 'బలి గడం' తప్పించుకునే యోగం లేక ఇలా కూలిపోయింది! ఏది ఏమైతేనేం 'కర్మభూమి' భారత దేశం మీద పడే 'ఖర్మ' దానికి తప్పింది. అది పడిపోయి దాని క్రింద సమాధి అయిపోతామేమోనన్న భయం పవిత్ర భారతీయులకి కూడా తొలగిపోయింది. [పిరాజీ]

# సినిమా విశేషాలు -జి. వి. జి.

### కుడి ఎడమైతే'లో దెబ్బకు దెబ్బ

లోగడ తనకు బూకరించిన దత్తుడు (నూతన్‌ప్రసాద్)కి అదే పద్ధతిలో తగు గుణపాఠం నేర్పాలని నిశ్చయించింది సావిత్రి (జయలక్ష్మి). అరోజు ఆమె పట్టి లంగాతో రావడం చూసి అతగాడు నిర్ఘాంతపోయాడు. "యేమిటే అవతారం? సీరేమైందే? లంగాతో వచ్చావేంటి?"

"మీ శీలం చాలా గొప్పదికాబట్టి పెద్ద ప్రమాదం నుంచి బ్రతికి బయటపడ్డాను.



'ముద్దు ముచ్చట'లో శారద

'యిదిగో యేటనుకుంటున్నారో – మా ఆయన మామూలు సేపం జరుకాదు. మోకాలితో కొబ్బరికాయు కొలిసిన మొగోడు. ఈ జిల్లా మొత్తానికి శీలంగల సిన్నోడని జెదిరించాను. బెదరలేదు. బతిమాలసాగాను. కాళ్ళావేళ్ళాపడి వేడుకోసాగాను."

"అప్పుడేమైందే!" దత్తుడు మరింత ఆత్రుతగా అడిగాడు.

"నేనేమైనా తెలివితక్కువదాన్నా? బుర్రగల కుర్రదాన్నేగా? ఆ మాట ఈ మాట చెప్పి, వాళ్ళని మాయచేసి, ఆళ్ళ కళ్ళల్లో కారం చల్లి, మీ శీలం నిలిపి, నా మానం కాపాడుకొని, ఈ శరీరాన్ని యిలా మోసుకొచ్చాను," అంది.

"అమ్మయ్యో! పెద్ద గండం తప్పింది. యెళ్లి చీర కట్టుకో," అన్నాడు దత్తుడు బరువుగా నిట్టూర్చి.

"సావిత్రి అలా బుకాయించిందేగాని, అసలు జరిగింది వేరే. ఆ సంఘటనలను మధ్య మధ్య ప్రేక్షకులకు చూపిస్తాం," అన్నారు "కుడి ఎడమైతే" వర్ణచిత్ర దర్శకుడు టి. ఎల్. వి. ప్రసాద్. అనిల్ ప్రొడక్షన్స్ వారి ఈ చిత్రానికి తాతినేని ప్రకాశరావు నిర్మాత.

### ఎన్. టి. ఆర్ తో
### టి. ఎల్ వి ప్రసాద్ కొత్త చిత్రం

అనిల్ ప్రొడక్షన్స్ వారి 4వ చిత్రానికి జూలై 10న ప్రసాద్ స్టూడియోలో తొలి పాట రికార్డు చేయబడింది. "షూటింగ్ ఈ నెల 19న ప్రారంభమవుతుంది," అన్నారు నిర్మాత తాతినేని ప్రకాశరావు. ఎన్. టి. ఆర్., జయప్రద, నూతన్‌ప్రసాద్, సత్యనారాయణ యింతవరకు ఎన్నుకోబడ్డట్లు తెలియజేశారు డైరెక్టర్ టి. ఎల్. వి. ప్రసాద్. మహేంద్రన్ కథకు జంధ్యాల సంభాషణలు రాశారు. సంగీతం, ఛాయ, శిల్పం, కూర్పులను చక్రవర్తి, పి. దేవరాజ్, తోట, కన్నన్ నిర్వహిస్తారు. ఇది ఈస్ట్‌మన్ కలర్ చిత్రం. టి. ఎల్. వి. ప్రసాద్ దర్శకత్వం నెరపిన తొలి చిత్రం "కుడి ఎడమైతే" త్వరలో విడుదల కాబోతోంది.

### "కొతలరాయుడు"లో

ప్రొడ్యూసర్లు యెక్కువయ్యారు ...



తిన్నగా చిలకపాటివారి తోటకెళ్లానా? అక్కడ మేమందరం కలసి పాటలు పాడుతూ, డాన్సు చేశాం.''

''ఆఁ! డాన్సా!''

''భజన ముగించి—''

''ఆఁ! భజనా?''

''అబ్బ — అదేనండి. డాన్సు ముగించుకొని యింటికి వస్తూంటే, అమాంతంగా ఇద్దరు రౌడీలు వచ్చి నన్ను పట్టుకొని—''

''రౌడీలా!''

''ఆ అమ్మలక్కలిద్దరూ లాక్కుపోయి...''

''అమ్మలక్కలా?''

''యేవిటండీ యీ యేల యిలా పట్టుకున్నారు? ఆశ్చేసండి — ఆ రౌడీలు లాక్కుపోయి, నేనెంత మొత్తుకున్నా వినకుండా నా చీర ఊడదీసేశారు. మీ శీలం ఎక్కడ చింతచెట్టు ఎక్కేస్తుందోనని భయపడ్డాను ... చీర లాగేయడంతోనే నాకు మాచెడ్డ కోపమొచ్చేసింది.

'కోతలరాయుడు'లో నాగేష్, రమాప్రభ

సత్యం హఠాత్తుగా కారుకు బ్రేక్ వేశాడు. ఇంటి గేటులోంచి వచ్చిన అందాలభామ పక్క రోడ్డుకేసి పోవడం చూడగానే హడావిడిగా కారును పోర్టికోలోకి పోనిచ్చాడు. హాలులో పాప, బుజ్జి నవ్వుకుంటూ, పుస్తకాలు విసురుకుంటున్నారు అమితానందంతో. సత్యాన్ని చూడగానే ''బాబాయ్! అపాయం తప్పింది. నువ్వు చెప్పినట్లే నేను కడుపునొప్పి అని గోలపెట్టా,'' అని పాప, ''నేను తలనొప్పని ఏడ్చేశా, దాంతో పంతులమ్మ వెళ్లిపోయింది,'' అని బుజ్జి — విజయం సాధించిన వారిలా హుషారుగా చెప్పేశారు.

''ఐతే, ఇందాక వెళ్లిన అందాలరాసి పంతులమ్మా?'' అన్న సంశయం కలిగింది సత్యానికి. ఆ విషయమే అడిగితే, ''అవును, బాబాయ్! ఆవిడే పద్మ పంతులమ్మ. రోజూ మేమిలాగే ఏడ్చేసి, రాకుండా చేసేస్తాం పంతులమ్మను,'' అంది పాప సగర్వంగా.

తను ఆ పిల్లలకు చెప్పిన ఉపాయంవల్ల అందమైన పంతులమ్మతో పరిచయం పెంచుకునే



'జాదగాడు'లో జయసుధ

అవకాశం జారిపోతున్నందుకు బాధ కలిగింది సత్యానికి. చాలా సిన్సియర్‌గా చెబుతున్నట్లు పాపను దగ్గరగా తీసుకొని, ''తప్పు, పాపా! అలా చేయడం తప్పు. ఇకనుంచి రోజూ బుద్ధిగా పంతులమ్మ దగ్గర బాగా చదువుకోవాలి,'' అన్నాడు. పాప (బేబీ తులసి), బుజ్జి (మాస్టర్ శ్రీధర్) ఆశ్చర్యంతో నోళ్ళు వెళ్లబెట్టి, ''బాబాయ్!'' అన్నారు ఒక్కసారిగా. ''అవును పంతులమ్మ ఇక చాలు అని బయల్దేరినా — మీరు పట్టుకు ఆపేసి, 'ఇంకా చెప్పండి పాఠాలు — ఇంకా చెప్పండి!' అనాలి,'' అంటూ హితబోధ చేశాడు సత్యం (చిరంజీవి).

పక్క గదిలోంచి వీళ్ళ సంభాషణ వింటున్న సత్యం తల్లి పార్వతమ్మ (నిర్మల), భర్త రంగారావు (హేమసుందర్)తో ''చూశారా? పసివాళ్ళ బాగు కోరి పాఠాలు చదువుకోవాలని వాడు ఎలా చెప్పాడో! వాడిలో సుగుణాలు ఉన్నాయని ఇప్పటికైనా ఒప్పుకుంటారా?'' అంది సవాల్ చేస్తున్నట్లు.

''తొందరపడి తీర్పు ఇచ్చే జడ్జీని కాను నేను. ఈ కేసు కాస్త అనుమానాస్పదంగా ఉంగి. ఆలోచించి తీర్పివ్వాలి,'' అన్నాడు రంగారావు తాపీగా.

''ఈ చిత్రంలో 'పంతులమ్మ' మాధవి... 'సత్యం' అల్లరిచిల్లరగా తిరుగుతూ, బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తూ, నచ్చిన యువతుల్ని తన వాక్చాతుర్యంతో వలలో వేసుకొని, విలాస జీవితం గడిపే నిత్య అబద్ధాలకోరు. అలాంటి సత్యం చివరన ఒక నిజం చెప్పి, ఉరికంబం ఎక్కుతాడు. కాని, అతని అసత్యాల వెనుక కఠోరమైన సత్యం దాగి ఉందని తర్వాత తెలుస్తుంది. అది తెలియక అన్నలు, తల్లిదండ్రులు కూడా అతన్ని అపార్థం చేసుకుంటారు,'' అని ఆ పాత్ర గురించి టూకీగా వివరించారు డైరెక్టర్ కె. వాసు. శ్రీ చిత్ర పతాకంపై తమ్మారెడ్డి వి. కె., నిర్మించే ''కోతలరాయుడు'' చిత్రం సగం పూర్తయింది. సత్యానంద్ సంభాషణలకర్త. చక్రవర్తి సంగీత దర్శకుడు.

'మున్సబుగారి అల్లుడు'లో రాణీచంద్ర






'యుగంధర్'లో ఎన్. టి. ఆర్.

## "బొమ్మా బొరుసే జీవితం"లో అబద్ధయ్య అగచాట్లు

అబద్ధయ్య (అల్లు రామలింగయ్య) వీపుమీద రాజా (మాస్టర్ రాజా) కూర్చొని ఉన్నాడు.

అబద్ధయ్య బాధపడుతూ మోస్తున్నాడు. రాజా చేతిలో కఱ్ఱ ఉంది. "ఈ వెహికల్ బాగుంది కదా, డాడీ?... ముసలినక్క!" అన్నాడు రాజా.

సమీపంగా టేబుల్ ముందు కూర్చొని ఫైల్ తిరగేస్తున్న గజపతి (సత్యనారాయణ) తల ఎత్తి, "ఫైన్, రాజా! ఫెంటాస్టిక్!" అన్నాడు.

అబద్ధయ్య రొప్పుతూ రోజుతూ, "రంగ మార్తాండ... కవికిశోర – అని బిరుదులిచ్చినట్టుగా రాజాబాబు నాకు ముసలినక్క అనే బిరుదు దయచేశారు, బాబూ! అనండి, బాబూ... నక్క, కుక్క, పిల్లి – అనండి," అని మూల్గాడు.

రాజాకు ఉత్సాహం మరింత ఎక్కువైంది. "నా ప్రియమైన పిల్లీ! నాలుక బయటకు చాపు. పాలు పోస్తుంటాను. చప్పరించు," అని నౌకరు చేత పాలు తెప్పించి పోయసాగాడు.

"నో రాజాబాబూ, నో!" అంటూ అబద్ధయ్య పడ్డ అవస్థ అంతా ఇంతా కాదు.

చంద్రమోహన్, మాధవి నాయకా నాయికలుగా కొమ్మినేని దర్శకత్వంలో యు. ఎస్. ఆర్ మోహనరావు నిర్మించిన శ్రీ సీతారామా ఆర్ట్ పిక్చర్స్ వన్నెల చిత్రం "బొమ్మా బొరుసే జీవితం" జూలై చివరి వారంలో విడుదల.



## "కళ్యాణి"లో మగరాయుడు

చినబాబుకు పుట్టిన కొడుకులో పెద్దమ్మగారి కళంతా కనబడుతోందని రాజమ్మ అంటే, "నిజంగనా? పెద్దయ్యగారెళ్లి చూడరంటావా?" అడిగాడు నౌకరు కుతూహలంతో

"ఈ పెద్దోళ్ళకి ప్రేమలు, పాశాలు ఉండవురా! ఆ పంతాలూ, పట్టింపులూ. . నాకు మనవడు పుట్టాడంటే — తుఫానులో అర్ధరాత్రి గోదావరి దాటి చూసొచ్చాను మనవణ్ణు పుట్టాడంటే ఆ రక్త సంబంధం పేగులు తోడెయ్యాలిరా!" అని రాజమ్మ (నిర్మల) అనడం విన్న రంగనాథం (ప్రభాకరరెడ్డి) "రాజమ్మా, బాబు ఏ హాస్పిటల్లో పుట్టాడు?" అన్నాడు ఆత్రుతతో

"అదే — మన రాజుగారి హాస్పిటల్లో, బాబూ! చినబాబు ఏం పాపం చేశాడు? మీ వంశం మొత్తానికి ఒక్కడే కొడుకు. ఆ కొడుక్కో బిడ్డ పుట్టాడు. తలలు బద్దలు కొట్టుకుని ఒకళ్ళ మొఖాలు ఒకళ్ళు చూసుకోని వాళ్ళయినా — మనవడి దగ్గరికెళ్లి చూసి ముద్దెట్టుకొస్తారు మీకు ఆ మాత్రం జాలి కూడా లేకుండా పోయిందేమిటి, బాబూ?" బాధపడింది రాజమ్మ

ఇంతలో రంగనాథం భార్య మీనాక్షి (రాజసులోచన) వస్తూ, "ఇలాంటి కబుర్లన్నీ మోసుకొచ్చి మమ్మల్ని ఎలా విడదీద్దామా — అని చూస్తున్నావా?" అని మండిపడింది

"నేనేం యిడదీయలేదు యీ కొంపని యిడగొట్టింది నువ్వే, తల్లీ!" అంది రాజమ్మ.



'ముత్తయిదువ'లో జయచిత్ర



'జాదగాడు'లో జయమాలిని

దాంతో మీనాక్షికి కోపం ఆగిందికాదు 'చూశారా! ఆవిడ తాలూకు మనిషని తీసుకొచ్చి నెత్తిన బెట్టుకున్నారు ఇప్పుడు మీ నోటికి ఆగడంలేదు నా నోటికి ఆగడంలేదు ,, మనవణ్ని చూడ్డానికి వెళ్తారా?" అని భర్తను అడిగేసరికి "నే వెళ్తానేంటి?" అని నీళ్ళు నమిలాడు రంగనాథం, జడిసిపోయి

దాసరి నారాయణరావు స్క్రీన్‌ప్లే, సంభాషణలు, దర్శకత్వంలో శ్రీమతి అన్నపూర్ణా నాగేశ్వరరావు సమర్పించే అన్నపూర్ణా స్టూడియోస్ "కల్యాణి" చిత్రం ఆగస్టు 17న విడుదల

### మురళీమోహన్ - శారద తొలిసారిగా

"ఎవడబ్బ సొమ్ము" చిత్ర నిర్మాతలైన అల్లపర్తి సురేంద్రనాథ్ సమర్పణలో వాసిరెడ్డి నాగేశ్వరరావు, మరో నిర్మాత ఎం నరసింహారావు కలిసి శ్రీ స్వామి అయ్యప్ప ఫిలిమ్స్ పతాకంలో ఒక వన్నెల చిత్రాన్ని జూన్ 26న ప్రారంభించారు మురళీమోహన్ సరసన మూగ — చెవిటి పాత్రలో శారదతోపాటు, సుభద్ర అనే మరో యువతి కూడా నటిస్తోంది రచన, సంగీతం, ఛాయ, కూర్పులను పీటూరి, మహదేవన్, గోపాల్, రవి నిర్వహిస్తున్నారు గిరిధర్ దర్శకుడు ఒక కోతి, ఒక కుక్క కూడా ఈ చిత్రంలో సంభ్రమాశ్చర్యాలు కలిగిస్తాయని ఈ చిత్రానికి కళా దర్శకత్వంతోపాటు చిత్ర నిర్మాణ బాధ్యతను కూడా నిర్వహించే కొండపనేని రామలింగేశ్వరరావు తెలియజేశారు

# హిందీ సినిమాలో నటించిన కెనడా అందాల సుందరితో విలేఖరుల గోష్ఠి

నిర్మాత త్యాగీ జె దయాల్ నిర్మించిన 'లవ్ ఇన్ కెనడా' హిందీ చిత్రంలో నటించిన కెనడా నటి శారీహోమిక్ అనగా 'మిస్ టీన్ ఆఫ్ కెనడా' బొంబాయి వచ్చినప్పుడు ఆమెతో పత్రికా విలేఖరులు జరిపిన ఇంటర్వ్యూ ఇలా వుంది

ప. వి 'మిస్ టీన్ ఆఫ్ కెనడా' పోటీలో మీరు విజయం సాధించిన తర్వాత హాలీవుడ్ చిత్రసీమకు మీరు వెళ్ళినప్పుడు ఆదరణ లభించలేదు నిజమేనా ?

నటి అసలు నేను నటి కావాలని అనుకోలేదు అటువంటప్పుడు నేను హాలీవుడ్‌కు పోయి ప్రయత్నించవలసిన అవసరం ఏముంది ! ?

ప. వి హిందీ చిత్రసీమలో మీరు ఎలా ప్రవేశించారు ?

నటి 'మిస్ టీన్ ఆఫ్ కెనడా' పోటీలో విజయం సాధించిన తర్వాత కెనడా టి వి. ప్రోగ్రాంలో నన్ను త్యాగీ దయాల్ పుత్రుడు జ్ఞానేశ్వర్ దయాల్ చూశారు తర్వాత ఆయన నన్ను కలుసుకొని, తమ హిందీ చిత్రంలో నన్ను నటించమని కోరారు కాని నేను వెంటనే అంగీకరించలేదు నేను ఆయనతో హిందీ చిత్రాల కథల గురించి, పాత్రల గురించి చర్చించాను తరువాత మా తల్లిగారు కూడా నాకు వివరములు చెప్పారు మా తల్లి మార్గదర్శకత్వంవలన నాకు విజయము లభించును కాన మా తల్లి ఒప్పుకున్న తర్వాత నేను ఒప్పుకోటానికి అభ్యంతరం పెట్టలేదుకదా

ప. వి : మీరు అంతకుముందు ఏదైనా హిందీ చిత్రం చూశారా ?

నటి : లేదు. ''టోరెంటో''లో వున్న భారతీయులకొరకు హిందీ చిత్రాలను చూపుతారు. వాటి సమీక్షలు మా పత్రికలు కొన్ని ప్రచురిస్తాయి ఆ సమీక్షలు చదివి, మీ చిత్రాలు, మా చిత్రాలు నిర్మించటంలో చాలా వ్యత్యాసం వుందని తెలుసుకున్నాను భారతీయ చలన చిత్రాలు కథమీద ఆధారపడి వుంటాయని నాకు అనిపిస్తూ వుంటుంది



ప. వి 'లవ్ ఇన్ కెనడా' చిత్రంలో పాత్ర మీకు నచ్చిందా ?

నటి నాకు నచ్చింది అందుకే ఒప్పుకున్నాను అదికాక ఆ చిత్రంలోని నా పాత్ర కెనడా అమ్మాయిదే కదా

ప. వి చిత్రంలోని హిందీ భాషను మీరు ఎలా మాట్లాడగలిగారు ?

నటి ముందు ఎలా పలకాలి అని తెలుసుకొని దానిని కంఠస్థము చేసేదానిని

ప. వి హిందీ కళాకారులతో మీరు పని చేసేటప్పుడు మీకు ఎలా అనిపించింది ?

నటి నాకు చాలా సంతోషము కలిగినది ఈ చిత్రమువలన వినోద్‌మెహ్రా, జితేంద్ర, మౌసమీఛటర్జీ నా కుటుంబ సభ్యులుగా నాతో కలిసిపోయారు

అసలు ఈ నటి బొంబాయి వచ్చినప్పుడు ''మౌసమీఛటర్జీ'' ఇంటిలోనే ఉందామనుకున్నారు కాని మౌసమీఛటర్జీ కలకత్తాకు వెళ్ళినందున, ఆమె వచ్చేవరకు హోటల్ షాలిమార్‌లో వున్నారు అప్పుడు హోటల్‌కు వచ్చిన పత్రికా విలేఖరులకు ఆమె ఇచ్చిన ఇంటర్వ్యూ ఇది

— మాస్టర్ రచ్చ భూమేశ్వర



## సినిమా

### ఆర్. ఎస్. రావ్ దర్శకత్వంలో రెండు చిత్రాలు

రావ్ కె, నిర్మించే రాం రాం ప్రొడక్షన్స్ చిత్రంలో సత్యేంద్రకుమార్, ప్రసాద్ బాబు, రమణమూర్తి, చిట్టిబాబు, సత్యకళ, పి. విజయలక్ష్మి, గిరిజ, వీరభద్రరావు నటిస్తారు భీశెట్టి లక్ష్మణరావు రచయిత

హరిశెట్టి సమర్పణలో రామకృష్ణ నిర్మించే శ్రీ వెంకటేశ్వర చిత్ర వారి ''శ్రీకృష్ణగారడి'' అనే భీమార్జునుల గర్వభంగం గాథను బి ఎల్ ఎన్ ఆచార్య రాశారు

పై రెండు చిత్రాలకు సత్యం సంగీత దర్శకుడు సుఖదేవ్ ఛాయాగ్రాహకుడు.

'గోరింటాకు'లో శోభన్‌బాబు, వి పద్మ



'మంఢే గుండెలు'లో కృష్ణ, శోభన్‌బాబు

# సినిమా

## "అల్లరి వయసు"

పిచ్చి మీనా (రమాప్రభ)ను పిచ్చిగా ప్రేమించాడు గోపి (నాగేష్). అందుకే ఆ రోజు ఆమె కోసం ఒక బహుమతి తెచ్చాడు "మీనా, మీనా! నీ కోసం ఒక ప్రెజెంటేషన్ తెచ్చా. ఏమిటో చెప్పుకో!"

"సేమ్యమిఠాయి."

"ఛా! పిల్లబుద్ధి," అని మృదువుగా మందలించి, "మంచి మనసులాంటి గులాబిపువ్వు," అంటూ తను తెచ్చిన గులాబిపువ్వును ఆమెకు అందించి, సిగ్గుపడిపోతూ, మెలికలు తిరిగి పోయాడు. ఈ లోపల మీనా మెల్లగా ఆ గులాబీని తినేసింది. ఈ విషయం గుర్తించని గోపి కాస్సేపటికి ఆమెవంక తిరిగి, "మీనా, ఎక్కడ. పెట్టుకున్నావ్ పువ్వు?" అంటూ ఆమె తలలో వెతకసాగాడు.

అతన్ని వారిస్తూ, తినేశానని చెప్పింది మీనా.

గోపీ అరక్షణం ఆశ్చర్యపోయి, అంతలోనే ఆనందపడిపోయాడు గలగలా నవ్వుతూ, "నా మనసు మొత్తం ఆ పువ్వులో పెట్టి నీకిచ్చాను నువ్వు మింగావు కదూ? ఇప్పుడు మనసూ మనసూ కలిసిపోయాయి. నా మనసు అస్తమానం 'మీనా మీనా' అంటోంది," అని సంబరపడిపోతూ, కావాలంటే వినమన్నాడు.

మీనా విని, "అన్నీ అబద్దాలే! లబ్ డబ్ లబ్ డబ్ – అంటోంది. అంతే మరి, నా మనసే మంటోందో విను," అంది. గోపీ విని, "డన్‌లవ్, డన్‌లవ్ – అంటోంది," అన్నాడు. అసలింతకీ, మనసేమిటి, ఎలా ఉంటుందో చూపించమని అంది మీనా

"మనసు లోపల ఉంటుంది. కత్తితో కోస్తే బయటకు వస్తుంది," అని గోపీ చెప్తూ ఆనందపడి పోయేసరికి పిచ్చి మీనా వెళ్ళి, నిజంగానే ఒక కత్తిని తెచ్చి, గోపీ గుండెమీద ఉంచింది. దాంతో గోపి త్రుళ్ళిపడి, "అమ్మబాబోయ్!" అని గుండె బాదుకున్నాడు.

రాజశేఖర్ దర్శకత్వంలో కె. వి. సుబ్బారావు, పి. పి. అబ్దుల్లా నిర్మించిన కళ్యాణ చిత్రవారి "అల్లరి వయసు" చిత్రంలో మురళీమోహన్, జయచిత్ర, జగ్గయ్య ముఖ్య పాత్రధారులు

### కమలహాసన్ శ్రీదేవి జంటగా "గురు" వర్ణ చిత్రం

ప్రమోద్ చక్రవర్తి సమర్పణలో ప్రకాశ్ ఆర్.సి. నిర్మించే శ్రీ శక్తి ఫిలిమ్స్ వినోదాత్మక వర్ణ చిత్రం "గురు" మొదటి షెడ్యూల్ పూర్తయింది. రెండవ షెడ్యూల్ ఆగస్టు 1 నుంచి 15 వరకు జరుగుతుందని చెప్పారు డైరెక్టర్ ఐ. వి. శశి. సత్యనారాయణ, మోహన్‌బాబు, ప్రభాకరరెడ్డి, కాంతారావు ఇతర ముఖ్య పాత్రధారులు. జంధ్యాల సంభాషణలకర్త. ఇళయరాజా స్వరకల్పనలో ఆత్రేయ గీతాలు రాశారు. జె విన్సెంట్ ఛాయాగ్రాహకుడు.

### కామేడ్ కంబైన్స్ వర్ణ చిత్రం

ఎం. ఎస్. కోటారెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తయారయ్యే కొత్త చిత్రానికి జూలై 5 న తొలి పాట రికార్డ్ చేయబడింది. రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, చిరంజీవి పి. ఎల్. నారాయణ ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. భమిడిపాటి రాధాకృష్ణ, సత్యం, పి. ఎస్. ప్రకాష్, కళాకార్, ఆర్. విఠల్ రచన, సంగీతం, ఛాయ, శిల్పం, కూర్పు శాఖలను నిర్వహిస్తున్నారు.

### "కిలాడి కృష్ణ"గా కృష్ణ

విజయనిర్మల స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎం. ఎ. అజీజ్ సమర్పించే వర్ణచిత్రానికి నిర్మాతలు నలుగురు డాక్టర్లు. వారు: ఎ. బి. కె. రెడ్డి, టి. వి. ఎం. రెడ్డి, ఎస్. డి. అహమద్, సి. నటేశం. ఆగస్టులో పాటల రికార్డింగ్, సెప్టెంబర్‌లో షూటింగ్ ప్రారంభమయ్యే ఈ సరోజినీ ఆర్ట్స్ చిత్రానికి మోదుకూరి జాన్సన్ రచయిత. పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు. కొండపనేని రామలింగేశ్వరరావు శిల్ప దర్శకుడు. ఆదుర్తి హరినాథ్ కూర్పరి. ప్రొడక్షన్ : పద్మనాభం. నిర్వహణ : ఎస్. రవికుమార్, ఎస్. రఘునాథ్.



### చంద్రమోహన్, రోజారమణి జంటగా "త్రివేణి" పిక్చర్ చిత్రం

విజయరాజ్ దర్శకత్వంలో పి. రాజగోపాల్ నిర్మించే సతీష్ పిల్మ్ స్క్రీన్స్ తొలి చిత్రానికి జూలై 9 న ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, శైలజ పాడిన తొలి గీతం రికార్డ్ చేయబడింది. జాలాది, విజయరత్నం గీతాలకు అవిరుద్ధ బాణీలు కూర్చారు. ప్రసాద్‌బాబు, త్యాగరాజు, చిట్టిబాబు, అంజన్ బాబు, శేఖర్, సుధారాణి, ఊర్మిళ, భాగ్యశ్రీ, బేబీ వాణి ఇతర తారాగణం. పి. ఆర్. గోపాల్ కథకు ప్రకాష్ మాటలు రాశారు. కూర్పు, ఛాయలను సురేంద్రనాథ్ రెడ్డి, కాకరాల సుధాకర్ నిర్వహిస్తారు. ☼

ఓ! యమ్మో! ఇంత పెద్ద చేపనెక్కడ పట్టావు తల్లీ!

ముద్దా—ముచ్చటా!　　　　గుమ్మా—పువ్వా!



# పౌష్టిక అనుభవము ఇవ్వజాలదు మరొకటి

అవును! యమ్మీ యమ్మీ ట్రూ బిస్కట్లు ఆనందంతో అనుభవింపదగినవి రుచికరంగా కరకరలాడుతూంటాయి. ఎన్నిసార్లైనా అలా నోట్లో వేసుకోకుండా వుండలేరు! తేనె, గ్లూకోజ్, పాలపొడి, ఏలక్కాయల ఎసెన్స్, తాజా ఎండు కొబ్బరి మొదలైన సహజ పౌష్టిక పదార్థాలు అతి జాగ్రత్తగా సూత్రీకరింపబడి విస్తృత ప్రయోగ ఫలితంగా ఏర్చి కూర్చిన శ్రేణి.

**హనీ గ్లూకోజ్**
తీయని బలవర్ధకమైన బిస్కట్లు, తగినంత అధిక పాళ్ళలో తేనె, ద్రవరూపంలో గ్లూకోజు చేరియున్నవి. ప్రతీ ప్యాకెట్ 350 క్యాలరీల శక్తిని కలిగిస్తుంది.

**నీస్**
కమ్మని కొబ్బరి బిస్కట్లు - తాజా ఎండు కొబ్బరి పుష్కలంగా వుండటంచేత అసలైన కొబ్బరి రుచినిస్తాయి.

**"యాలక్కాయి" కస్టర్డ్ క్రీమ్**
చప్పరించడానికి స్వాదుష్టమైన క్రీమ్ బిస్కట్లు అసలైన యాలకులతో ఎంతో ఉత్తమమైన క్రీమ్ బిస్కట్లు.

**మారీ**
కొంచెం తీపితో గరగరలాడుతూ కాఫీ, టీలతో తీసుకోడానికి అనువుగా వుంటాయి. మీ పానీయాలతోపాటు తినడానికి ఆదర్శమైనవి.

**ఇంకా ఎన్నెన్నో**

వీటిలో ప్రతిది కూడా విశిష్టకరమైన పొట్లంలో ఉంటుంది. వాస్తవానికి బిస్కట్ల తయారీలలో మేమొక్కరమే సెలోఫేన్ ఖరీదైన కాగితం) ధారాళంగా వుపయోగిస్తాము. నేరుగా బిస్కట్లను చుట్టివుండటంచేత బిస్కట్లు సువాసనతో ఉంటాయి - గిరగరలాడు తూంటాయి - ఫ్యాక్టరీనుంచి అప్పుడే వచ్చినట్టు తాజాగా వుంటాయి.

**మీరు మీ కుటుంబం పుష్టికరమైన రకరకాల బిస్కట్లతో విందు చేసుకోండి. వాటి విశిష్టత మీరే గ్రహించండి.**




## ట్రూ బిస్కట్లు




**4 'మాండీ' పతకాల విజేత**




ఇండియాలో అధునాతనమైన ఫ్లోర్ మిల్ మరియు ఉత్తమమైన బిస్కట్ల తయారీ ఫ్యాక్టరీలో తయారు కాబడినవి

Headstart/ATM/104

# బొమ్మల మహాభారతం దుర్యోధనుని ప్రాయోపవేశం

మండపాక సీతారామాంజనేయులు

( గత సంచిక తరువాయి )




























[ఇంకా ఉంది]

# జాలి ఖరీదు

పాలగిరి వేణు



శ్రీమతినుంచి ఉత్తరం వచ్చింది. అర్జంటుగా ఓ వంద పంపమంటూ..

నెల ఆఖరి వారం చేతిలో పైసా లేదు

అప్పారావును అప్పు అడిగితే "నిన్ననే అడగరాద్రటా! వందేమిటి? రెండొందలు యిచ్చేవాణ్ణి" అంటూ తనకున్న మొండి చేయికూడ చూపించాడు..

అవసరానికి ఆదుకొనే అప్పారావు తనకూడ యింకో వంద చూడమన్నాడు నా పనిలో పనిగా...

శ్రీమతి అనవసరంగా డబ్బు గురించి రాయదు... ఎంతో అవసరమయేవుండాలి... పూర్తిగా వివరాలు రాయలేదు... చలపతిని అడిగాను... "జీతం పడుతూనే యిస్తానంటే వందేమిటి? నూట ఏభైదాకా సర్దుతానన్నాడు..."

డబ్బు యింత సులభంగా దొరుకుతుం దనుకోలేదు. మొదటి తేదీ యింకా ఐదు రోజులుంది శ్రీమతికి వంద పంపితే, నా ఖర్చులకుగాను ఎలాగూ ఏభైదాకా కావాల్సి వుంటుంది

"సరే!" నంటూ చలపతి చేతులు పట్టుకున్నాను.

డబ్బు అందింది...

'టైం' చూసుకుంటే మూడు దాటు తోంది...

రిక్షా పిల్చి, 'ఆబిడ్స్'కు వెళ్ళమన్నాను. ఓ అరగంట తర్వాత 'ఆబిడ్స్'లో దిగి, చేతికందిన చిల్లర్ని రిక్షాబాబు చేతిలో పోశాను... "జనరల్ పోష్టాఫీసు"లోకి దూరాను... జనం బాగా వున్నారు. "మనీ ఆర్డర్ల" క్యూలో నిలబడ్డాను. నా ముందు ఓ ఇరవైమందిదాకా వున్నారు... ఐదు నిముషాలయ్యాక తెల్సింది, నా దగ్గర ఎమ్. ఓ ఫారం లేదని... వెనక తిరిగి చూశాను. ఇంకో ఇరవైమందిదాకా వున్నారు... ముందువాడికి, వెనకవాడికి మొహమాటం లేకుండా "ఫారం మరచిపోయి వచ్చాను వెంటనే వచ్చి మళ్ళీ క్యూలో కలుస్తానని" చెప్పాను... వాళ్ళు సరే నన్నారు...

కౌంటర్లో ఫారం తీసుకొని ఖాళీగానున్న ఓ టేబిల్ ముందు కూచొని నింప బోయాను...

"బాబూ!"

తలెత్తి చూశాను...

ఎదురూగ్గా... అతడికి ఏభై దాటుం డొచ్చు... ముఖంలో దైన్యత్వం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది...

"ఏంకావాలండీ!"

అతడు ఏదో చెప్పబోయాడు... చెప్పలేక పోయాడు...

ఫారమ్ పూర్తిచేశాను... అక్కణ్ణించి లేవబోయాను...

"చూడు! బాబూ!!"

తిరిగి చూశాను...

"బాబూ! నాకు ఓ ఐదు రూపాయలు కావాలి... మా ఆవిడకు డబ్బు పంపాలి. అనంతపురం ఆస్పత్రిలో మా అమ్మాయిని

చేర్చారట... డబ్బు సకాలానికి పంపకపోతే ఆమె ప్రాణానికి ముప్పు రావచ్చు...నా దగ్గర ఓ వందదాకా వుంది... "ఎమ్. ఓ. కమీషను" తెచ్చుకోవడం మర్చిపోయాను... మేముండేది 'ఉప్పుగూడ'లో... వెళ్ళి రావాలంటే చాల కష్టము..." చెప్పబోతు న్నాడు... మాటల్లో పొందికలేదు... గొంతులో ఆదుర్దా, ఆందోళన కలిసి వున్నాయి...

"నాకు ధర్మం చేయొద్దు... అప్పుగా యివ్వండి చాలు."

ఆ మనిషిలో గొప్ప అభిమానం వుంది... చెప్తున్నది అచ్చునిజంలా వుంది... అడిగింది ఓ ఐదు రూపాయలు... ప్రస్తుత పరిస్థితుల్లో రెండు పూటలు భోజనంకూడ చేయలేమేమో ?...

మన స్తోమతకు తగ్గట్టుగా... చేసేది గొప్ప సాయంకాదు... మనిషికి విలువ యివ్వలేదు... అతడి అవసరానికి ఆదుకొన్నాను... ఒక్కోసారి తాహతుకు మించి ఆదుకోవడం మానవసహజం...

నా అడ్రస్సు అడిగాడు... ఇచ్చాను... నమస్కరించాడు...గుంపులో కల్సిపోయాడు.

ఎమ్. ఓ చేశాను. ఇంతవరకు వున్న కంగారు తగ్గింది... అతడు అక్కడ కనపడ లేదు. క్యూలో చూశాను... లేడు మరి... ఏదో అనుమానం వేసింది... పోతే పోయింది వెధవ ఐదు రూపాయలు... ఆఫీసు చేరు కున్నాను...

సాయంకాలం అప్పారావు వచ్చాడు వూసులాటకోసం... మధ్యాహ్నం జరిగిన సంగతి చెప్పాను.

"నీవు నిజంగా అమాయకుడివిరా! ఒరే పిచ్చినాయనా! సరిగ్గా ఒక నెల క్రిందట నాకు యిలాగే జరిగింది. అప్పుడేమో వాళ్ళబ్బాయి కాలేజీలో చదువు తున్నాడని, ఆ రోజే డబ్బు పంపకపోతే కాలేజీ ఫీజు కట్టకపోవడంవల్ల కాలేజిలోంచి అబ్బాయిని గెంటేస్తారని... ఇప్పుడేమో కూతుర్ని ఆస్పత్రిపాలు చేశాడు. అప్పుడేమో అతడికి సాయం చేయలేదుకదా బాగా చివాట్లు మాత్రం పెట్టాను. ఇప్పుడేమో నీవు అతడికి డబ్బిచ్చి, అతగాడి కూతురు ప్రాణాల్ని నిలబెట్టావ్!... ఐదు రూపాయ లంటే నీకు ఐదు పైసల్లా కనిపిస్తున్నా యనుకుంటాన్రా" అంటూ అప్పారావు నన్ను హాస్యం చేశాడు. బాగా నవ్వడంతో వాడికి గొంతులో పొరపోయింది. నీళ్ళిచ్చేసరికి తేరుకున్నాడు...

వాడికి నేను బదులు చెప్పలేదు... నేను మోసపోయాను... కాదు తోటి మనిషికి, అతడి మానవత్వానికి విలువ నిచ్చాను... ఈ సంఘటన మరిచిపోవడానికే ప్రయత్నిం చాను...

రోజులు, నెలలు... మూడు సంవత్సరాలు గడిచిపోయాయి... ఆర్నెల్ల క్రితం నేను పనిచేస్తున్న ఆఫీసును మా కంపెనీవాళ్ళు దివాలా తీయడంతో మూసివేశారు. నేను నిరుద్యోగిని... గవర్నమెంటు ఉద్యోగానికి వయోపరిమితి దాటిపోయింది. మళ్ళీ ఏ ప్రవేటు కంపెనీలోనో వెదుక్కోవాలి... శ్రీమతికి నలుగురు పిల్లలతో ఆరోగ్యం దెబ్బతింది. ఆర్థికంగా నా సంసారం చితికి పోయి... రోజులు గడవటమే దుర్భర మయ్యింది... ఉద్యోగపు వేటలో అలసి పోయాను. ఉద్యోగం ఖాళీ వుందంటూ వారంనాటి పేపర్లో చూశాను. విదేశీయ సంస్థ... అప్లికేషన్‌తోబాటు ఓ ఏడు రూపాయల పోష్టల్ ఆర్డరుకూడ జతచేసి పంపాలి... చేతిలో ఒక్క రూపాయకూడ లేదు... ఉంటే ఓ అరపూట గడుస్తుందనే భావన వుంది నాలో... స్నేహితుల్ని అడిగాను... ఓ మూడు రూపాయలు పుట్టించాను. అంతకంటే వాళ్ళు యివ్వరు మరి... నేను వాళ్ళకొక "ప్యారసైట్"ను అయిపోయాను. ఏంచేయాలో తెలియక నిరాశతో యింట్లోనే వుండిపోయాను... పోనీ అదే మూడు రూపాయలతో రెండు పూటలు గడిచేందుకు బియ్యం కోసం కొట్టుకు బయల్దేరాను. దారిలో ఎదురుగ్గా నరసింహ్మం కనిపించాడు... అతడు మా పేట పోష్టుమాన్...

"సార్! మీకో మని ఆర్డరొచ్చింది" అంటూనే సంచిలోంచి ఫారం తీశాడు... నాకు డబ్బు ఎక్కణ్ణించీ వచ్చే అవకాశమే లేదు...ఆ వచ్చిందికూడ ఐదు రూపాయలే...

"ఇన్ని రోజులకు మీ అప్పు తీరుస్తు న్నాను...క్షమించగలరు" అంటూ ఫారమ్‌లో రాసివుంది... అంతకన్నా యింకేంలేదు...

గతమంతా కళ్ళముందు తిరిగింది... ఆ రోజు నేను చేసిన సాయం ఈ రోజు యిలా ఆదుకుంది.

డబ్బును తీసుకొని పోష్టాఫీసుకు పరుగెట్టి పోష్టల్ ఆర్డర్లు తీసుకొన్నాను. దరఖాస్తుతోపాటు వాటిని ఆ విదేశీయ సంస్థకు పంపించాను...

నెల రోజులయ్యాక ఇంటర్వ్యూ వచ్చింది. మరో వారం తర్వాత ఉద్యోగంలో చేరమంటూ ఆర్డర్లు వచ్చాయి... వెంటనే చేరిపోయాను.

ప్రస్తుతము నా జీవితము సుఖంగా వుంది... మబ్బును విడిచిన వెన్నెల్లా... ఆర్థికంగా నిలబడ్డాను... మా ఆవిడ ఆరోగ్యం బాగయ్యింది...

జీతంకూడ నాలుగంకెల పైనే వుంది...

కాని యిదంతా జాలి... ఖరీదు మాత్రమే... ●



# డాక్టరు సలహాలు

## డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**కె. డి. డి. – నూజివీడు**

మా పాప వయస్సు 2 నెలలు. పుట్టిన 10 రోజుల నుండి నీళ్లగా విరోచనాలు అయ్యేవి. పాపకి డబ్బా పాలు వాడుతున్నాము. విరోచనాలకు మందులు వాడినా పూర్తిగా తగ్గలేదు. పాలడబ్బా మార్చినా పాలు త్రాగిన ప్రతిసారి పసుపు, ఆకుపచ్చ రంగులో విరోచనం అవుతోంది. రోజుకి 5 సార్లు తక్కువ కాకుండా అవుతున్నాయి.

ప్రకృతి సిద్ధంగా చంటిపిల్లలకు 6వ నెల వచ్చే వరకూ రోజుకి 4, 5 సార్లు మల విసర్జన జరగటం సహజమైనది. మీ పాప విషయంలో, మీరు వాడేది డబ్బాపాలు కాబట్టి పాలపౌడర్, నీళ్లు ఈ రెండిటిని మిశ్రమం చేసే విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. పాప బరువునిబట్టి పాలపౌడర్ కలిపే నీళ్లు ఉంచాలి. ఆ పాలడబ్బా మీద వ్రాసిన ప్రకారం వయసునుబట్టి ఆ పాలపొడి వాడితే విరోచనాలు నీళ్లగా అవటం, ఎక్కువసార్లు పోవటం జరుగుతుంది. పాలడబ్బాలో ఉన్న స్పూన్‌తో కొలగొట్టే ఒక స్పూను పాలపొడిని ఒక ఔన్సు నీళ్లతో కలిపితే అది ఒక ఔన్సు నీళ్లు కలపని ఆవుపాలతో సమానం. ఈ ఔన్సుపాలు 1 గ్రాము ప్రోటీను, 20 కాలరీల శక్తినిస్తాయి.

పసిపిల్లలకు ఒక సం. వయస్సు వచ్చే వరకూ 1 రోజుకి 1 కిలోగ్రాము బరువుకి రెండున్నర లేక 3 గ్రాముల ప్రోటీనులు శరీరాభివృద్ధికి, ఆరోగ్యానికి ముఖ్యావసరం. అంటే ఉదాహరణకి పాప బరువు 5 కి.గ్రా అయితే రోజుకి 5. 3–15 గ్రాముల ప్రోటీన్లు అవసరం. ఒక ఔన్సు పాలు 1 గ్రాము ప్రోటీన్లు మాత్రం ఇవ్వటంవల్ల 15 గ్రాముల ప్రోటీన్లు కావాలంటే 15 ఔన్సుల పాలు ఇవ్వవలసి ఉంటుంది. ఒకరోజుకి 5 సార్లు పాలు పడితే ప్రతిసారికి 3 ఔన్సుల పాలు పట్టాలి. పుట్టినప్పటి నుండి 3వ నెల వరకు ఈ మిశ్రమానికి 2 ఔన్సుల నీళ్లు అదనంగా కలపటం అవసరం. 3 నుండి 6 నెలల వరకు 1 ఔన్సు నీళ్లు అదనంగా కలపటం మంచిది. 6 నెలల తర్వాత మామూలుగా పట్టవచ్చును.

**వై. జె. – కలకత్తా**

మా తమ్ముడికి పుట్టినప్పటి నుండి మోకాళ్ల దగ్గర నుండి పాదాల వరకూ వంకర. కలకత్తా హాస్పిటల్‌లో చేర్చాము. ప్లాస్టిక్ సర్జరీ చేస్తే సరిపోతుందని చేసారు. కాని కాళ్లు అలాగే ఉన్నాయి. ఆ కాళ్లు బాగవుటకు ఏమి చికిత్స చేయవలెను.

'టాలిపెస్ ఇక్వైనో' అనే యీ కాళ్ల వంకర పుట్టినప్పుడే ఏర్పడటం జరుగుతుంది. ఈ వంకర కాలు ఉన్నవారికి ప్రత్యేకమైన బూట్లు (ఇనుప కడ్డీలతో పటిష్టం చేయబడినవి) ఉన్న వంకరను బట్టి క్రమ క్రమంగా మార్చుతూ రావలసి ఉంటుంది.

ఈ రోగం నయమయ్యేవరకి, కుటుంబంలోని ఇతర సభ్యుల ఓర్పు దాదాపు నశించి పోతుందంటే దీనివైద్యం పరిరక్షణ ఎంత కష్టతరమైనదో ఆలోచించండి. క్రమేణా రావలసిన మార్పుకాబట్టి తొందరపడి మనసు పాడు చేసుకోవటం అనవసరం.

**[illegible] – నరసరావుపేట**

మాకు బంధువుల అబ్బాయి 'కన్‌జెస్టివ్ హార్ట్ ఫెయిల్యూర్' వచ్చి చనిపోయాడు. అంతకుముందు ఆస్పత్రిలో 5 సం.ల వయసు తర్వాత ఆపరేషన్ చెయ్యాలి అని అన్నారు. విపరీతంగా ఆయాసం వుండేది. అలా మరణించటం ట్రీట్‌మెంట లోపమా? లేక స్వాభావికమా?

కన్‌జెస్టివ్ హార్ట్ డిఫెక్టు వున్నప్పుడు హృదయములోని గోడలలోగాని, కవాటములలోగాని వున్న లోపాలవల్ల రక్తప్రసరణకు ఇబ్బంది, మంచి—చెడు రక్తముల కలయిక మొదలగు వాటివల్ల, ఆయాసము, హృదయము సరిగా పనిచేయకపోవటము (హార్ట్ ఫెయిల్యూర్) శరీరంలో నీరు చేరటం, లివర్ పెద్దదవటం జరుగుతుంది. ఈ ఫెయిల్యూర్ ఎక్కువగా వున్నప్పుడు ఎంతమంచి వైద్యముచేసినా రోగిదక్కటం అపురూపమే. మీ బంధువులఅబ్బాయి చనిపోవటానికి ట్రీట్‌మెంటు లోపానికి సంబంధము లేదు.

**ఆర్. ఎన్. ఆర్. – నెల్లూరు**

ఒక సంవత్సరముగా నాకు కాళ్లు, చేతులు పోట్లుగా వుంటున్నాయి. పోట్లు వచ్చేటప్పుడు జబ్బదగ్గరనుండి వ్రేళ్లవరకు చల్లబడుతుంది. ఇలా రావటానికి కారణమేమిటి ? దీనికి ఏమిచెయ్యాలి.

ఇలా రావటం రక్తనాళములు నొక్కుడుపడటం వల్ల [సెర్వైకల్ రిబ్ మొదలగువాటివల్ల] సింపతెటిక్ నెర్వస్ సిస్టమ్ ఎక్కువగా పని చేయటం వల్ల, నరాల బలహీనతవల్ల జరుగుతుంది. బి1, బి6, బి12 ఇంజక్షన్లు వాడండి. బెంజ్ మాత్రలు క్రమంగా వాడాలి. మూత్ర పరీక్ష చేయించు కోవటం అవసరం. అలాగే మెడ భాగాన్ని ఎక్సరే తీయించి డాక్టరుకి చూపించండి.

**[illegible] – పెరవలి**

మేము ఆర్థికంగా చాలా వెనుకబడి వున్నాము. ఈ రోజులలో అన్ని ధరలు పెరిగిపోయాయి గదా! వున్నంతలో మేము ఆహార విషయంలో ఆరోగ్యంగా వుండాలంటే ఏమి తింటే బాగుంటుంది.

బాగా డబ్బున్నవారే ఈ రోజుల్లో ఆరోగ్యంగా వుంటారనుకోవటం చాలా పొరపాటు. ఆర్థికంగా వెనుకబడి వున్నవారు కూడా ఎక్కువ ఖర్చు లేకుండా పుష్టికరమైన ఆహారం తీసుకోవచ్చును. అన్నంతో పాటుగా ఎక్కువగా ఆకుకూరలు, చౌకగా దొరికే దుంపకూరలు, రాగులు, మొక్కజొన్న మొదలైనవి తీసుకుంటే ఆరోగ్యాన్ని కాపాడుకోవచ్చును.

కుటుంబములోని సభ్యుల సంఖ్యను బట్టి వయస్సునుబట్టి ఆహార విధానాలను నిర్ణయించాలి. కాఫీ, టీ మొదలైన పానీయాలకు బదులు, పలుకొంచెం అయినా పాలు, మజ్జిగ తీసుకోవటం మంచిది. బంగాళాదుంపలు తిన్నవారికి చౌకగా వున్న చిలకడ దుంపలు తిన్నవారికి వ్యత్యాసమేమీ తెలియదు.

**జె. [illegible] – [illegible]పురం**

మా బాబుకి 2 సంవత్సరములు. ఆరోగ్యంసరిగ్గా లేకపోతే డాక్టరుకి చూపిస్తే, రిక్కెట్సు అని చెప్పారు. తల్లిగర్భంలో వుండగానే ఈ రోగం మొదలయిందన్నారు.

రిక్కెట్స్ అనే వ్యాధి విటమిన్ 'డి' లోపం వల్ల వస్తుంది. ఈ జబ్బు రెండు విధాలు. విటమిన్ డి లోపం వల్ల వచ్చేది. విటమిన్ డి వున్నా కూడా శరీరం దానిని ఉపయోగించుకోలేని పరిస్థితిలో వచ్చేది. మొదటిదానికి వైద్యం చాలా సులభం. ఆ రోగం చాలా అరుదు కూడా. రెండవదానికి కారణాలు ఎక్కువ. దీనితోపాటుగా ఎన్నో ఇతర లక్షణాలు వుంటాయి. డాక్టరు చెప్పినట్లుగా ఈ రోగం పుట్టుకముందే ఏర్పడుతుంది. కారణం కనిపెట్టడానికి కొన్ని పరీక్షలు చెయ్యాలి. మీకు దగ్గర వున్న పెద్ద హాస్పిటల్‌లో చూపించండి.

**ఎస్. ఎమ్. ఎన్. – బుచ్చిరెడ్డిపాలెం**

మల విసర్జన సరిగా జరుగుటలేదు. కటిల దగ్గర నెప్పిగా వుంటోంది. మలములో పురుగులు పడుతోంది.

ఇలాంటి పురుగులను త్రెడ్‌వర్మ్స్ అంటారు. ఇవి వున్నప్పుడు ఆహారం సరిగ్గా తీసుకోకపోవటం, పండ్లుకొరకటం, కడుపునొప్పి, ఆసనద్వారము దురద ఎక్కువగా కనబడే లక్షణాలు.

వీటికి పైపరజిన్ సిట్రేట్ అనే మందు రోజుకి రెండు చెంచాల చొప్పున ఏడురోజుల పాటు వాడి, ఎనిమిదవ రోజు విరోచనాలకు మందు వేసుకోవాలి.

కుటుంబములోని వారందరూ ఒకేసారి ఈ మందు తీసుకోవాలి. ఈ క్రిములు తిరిగి రాకుండా గోళ్ళు కత్తిరించుకోవటం, మలవిసర్జన సమయంలో పాదరక్షలు ధరించటం, ఆహారపదార్థాలను కడిగి బాగా వుడికించి తీసుకోవటం ముఖ్యం.

**[illegible] – [illegible] రోడ్**

తిరుపతి నుంచి బస్సులో తిరుమల ప్రయాణించేటపుడు కొందరు వాంతి చేసుకుంటారు. దీనికి కారణమేమిటి?

ఈ బస్సు ప్రయాణంలో బస్సు ఎక్కువ మలుపులు తిరుగుతూ వస్తుంది కదా! అలా తిరిగేటప్పుడు భూమి మట్టమునుండి ఎత్తు ఎక్కువ అవటం వుండటం వల్ల చెవులలోని ఎండోలింఫ్ అనే ద్రవం కదలికవలన కళ్ళు తిరగటము, కడుపులోని ఆహారం కూడా కదలిక చెంది వాంతులు రావటం జరుగుతుంది.

# భ్రమర పంచకం

కాళీపట్నం సీతావసంతలక్ష్మి



"కట్నం తప్పక ఇచ్చితీరవలసిందేనండీ! పెళ్ళికొడుక్కి కాదూ, ఆడబడుచులకూ, అత్తగారికీ కాదు. ఆర్థిక రక్షణ లేని ఆడపిల్లలకు" తపీమని చెప్పింది. ఆమె చెప్పింది అర్థం కానట్టు చూశాడు సాగర్.

మిగతా అందరూ రావడంతో ఆఫీసు హడావిడి మొదలయింది. ఆ రోజెందుకో ప్రభాకర్రావు హాఫ్‌డే లీవు పెట్టాడు. ఇంకా పన్నెండు దాటకుండానే చక్రవర్తి చుట్టూ చేరారంతా. సాగర్ పెళ్ళికొడుకుదీ, తన చెల్లెలిదీ జాతకాలు తీసి చక్రవర్తి చేతికిచ్చాడు. ఏం చెబుతాడో అని ఆత్రుతగా ఎదురు చూడసాగాడు. అందరూ నిశ్శబ్దంగా చక్రవర్తి వైపే చూస్తున్నారు. కాగితం మీద చక్రాలూ అవీ గీసి, ఏవో లెక్కలూ అవీ చేసి, కొన్ని నిముషాలు అవి పరిశీలించి, అందరినీ సస్పెన్సులో తగినంత సేపు ముంచాక మెల్లిగా తలెత్తి చెప్పాడు. జాతకాలు కుదిరాయనీ, పెండ్లికొడుకుది బ్రహ్మాండమయిన జాతకమనీ అన్నాడు.

"సాగర్ గారూ! మీరు పార్టీ ఇవ్వాలింక. కట్నం లేకుండా యింత మంచి పెళ్ళికొడుకును చవకగా కొట్టేస్తున్నందుకు." బాపూజీ కోరాడు.

"చవకా, ప్రియమూ ఏమిటండీ! చేపల బజారు లాగా. వారి చెల్లెలిదీ వారిదీ అదృష్టమనండి. అయినా తడిపి మోపెడయే లాంఛనాలూ, పెళ్ళి ఖర్చులూ ఉన్నాయి గదా" అని నవ్వి "చక్రవర్తి గారూ! నా చేయి చూసి నాకు ఫారిన్ ట్రావెల్ ఉందో లేదో చెప్పండి మా అన్నయ్యెప్పుడూ 'నువ్వు ఫారిన్ వెళ్ళి ఇండియాలో అంట్లా తోముతారో చెబుతా' అని అంటాడు. నాకు భలే కోపం వస్తూంటుంది" అంటూ చేయి చాచింది.

"చేయి మాత్రమే చూసి జాతకం చెప్పడం చాలా కష్టమండీ. మీ జాతక చక్రం కూడా వుంటే విషయాలన్నీ ఇంకా క్లియర్‌గా తెలుసుకోవచ్చు" అంటూ ఇష్టం లేనట్లు ఆమె చేయందుకున్నాడు. విడమ చేతి నందించి ఏమి చెబుతాడో అని ఆశగా చూస్తోంది క్రిష్ణవేణి. రెండు మూడు నిముషాలు గడిచాయి. అరచేయి నొక్కాడు చక్రవర్తి. వ్రేళ్ళు విరిచాడు వెనక్కి. బొటన వ్రేలు పట్టి అటూ ఇటూ తిప్పాడు. ముందు నాలుగు వ్రేళ్ళూ కలిపి నొక్కాడు.

*(గత సంచిక తరువాయి)*

"మీరు డబ్బు ధారాళంగా ఖర్చు చేస్తారు. వచ్చే డబ్బు వస్తూంటే మీరలా ఖర్చు పెట్టేస్తూంటారు. మీది చీకూ చింతా లేని గే లైఫ్." ఈ మాట అనేసి చుట్టూ అందరూ ఉండగా అనకూడదనే విషయం విస్మరించినందుకు నాలుక్కరుచుకున్నాడు.

"ఫారిన్ సంగతి చెప్పమంటే ఏమిటేమిటో చెబుతున్నారు." సన్నగా విసుక్కుంది క్రిష్ణవేణి.

చేయి వెనక్కి తీసేసుకుంటుందేమోనని భయంకొద్దీ చక్రవర్తి ఆమె చేతిని కొంచెం గట్టిగా పట్టుకొని అరచేతి క్రింద వైపు భాగాన్ని పరీక్షించాడు.

"ఇదుగో ఈ అడ్డగీత మీద క్రాస్ అవుతూ మరోక లైను 'ప్లస్' లాగా ఫార్మ్ అయిందే. దీనివల్ల ఫారిన్ ట్రావెల్ తప్పదు. మీకు కోపం వచ్చినా సరేగాని, మీ వైవాహిక జీవితం సుఖమయంగా ఉండి ఫారిన్‌లోనే గడుస్తుంది చాలా భాగం." ఆమె చేతిని మరోసారి పరీక్షించి తను చెప్పింది ఖాయమన్నట్లు తల పంకించాడు చక్రవర్తి.

అయిపోతే మళ్ళీగా ... లంచవరు పూర్తి కావడానికింక పదిహేను నిముషాలు మాత్రమే ఉంది. అందరూ ఆదరా బాదరాగా తమ తమ భోజనాలు కానిచ్చారు. టిఫిన్ డబ్బా తీసుకుని బాత్రూంలో కెడుతూంటే కారిడార్‌లో ఎవరో మాట్లాడుకుంటూ మధ్యలో తన పేరెత్తడంతో క్రిష్ణవేణి కాళ్ళకు బంధాలు పడ్డాయి.

"గురుడు చేతులు గట్టిగానే నొక్కాడే. ఫరవాలేదు. క్రిష్ణవేణి సుశీలలా భయస్తురాలు కాదు" ఇది బాపూజీ కంఠం

"అసలు చక్రవర్తిని, వ్యవహారం ముదిరిందని సుశీల తండ్రి పెళ్ళి చేసుకోమన్నాట్ట. అదృష్టవంతుడు! ఎలా గో బయట పడ్డాడు" సాగర్ కంఠంలో అసూయ.

"ఏమిటి వీళ్ళంటున్నది? క్రిష్ణవేణికి కళ్ళు తిరిగినంత పనయింది. ఎవరీ సుశీల? వీళ్ళందరూ ఆమె నేం చేశారు? చక్రవర్తి మంచివాడు కాదా? ఒక ఆడపిల్ల మగవాడితో స్నేహంగా ఉంటే చూసి పెడర్థాలు తీసే హక్కు వీళ్ళ కెవరిచ్చారు? స్త్రీలు స్నేహశీలత ప్రదర్శిస్తే దాన్ని లైంగికంగా తప్ప మరే విధంగానూ చూడలేరా? స్త్రీ పురుషుల సంబంధం శారీరకంగా తప్ప మానసికంగా, ఇంటలెక్చ్యువల్‌గా ఉండడానికి వీలు లేదా? ఎప్పుడు ఈ దేశంలో మనుషులు మారేది? స్నేహంలో ముందడుగు ఆడపిల్ల వేస్తే దాన్ని తప్పటడుగుగా

# భ్రమర పంచకం

మారటమే గాని, అపార్థం చేసుకోకుండా ఒక స్నేహ భరిత హృదయాన్ని తెలుసుకోలేరా?" ఈ సంఘం మీద విపరీతమయిన కోపం వచ్చింది క్రిష్ణవేణికి.

ప్రభాకరరావు వచ్చేసినట్టున్నాడు. అందుకని కారిడర్‌లో మనుషు లెవరూ లేరు ఆమె బైటి కొచ్చేసరికి.

ఆ మధ్యాహ్న మంతా అన్య మనస్కంగా ఉండి పోయింది సాయంత్రం యిల్లు చేరాక కూడా ఆమె చికాకు పోలేదు. బాగ్ అలమారలో ఓ ప్రక్కగా పెట్టింది స్నానం చేసి, వేరే శుభమైన తెల్లటి బట్టలు వేసుకుని ఇవతలకు వచ్చాక కాస్త బాగున్నట్టనిపించింది. డైనింగ్ రూంలో కొచ్చింది క్రిష్ణవేణి బల్లమీద టిఫినూ, టీ రెడీగా పెట్టి తల్లి అక్కడే నుంచుంది ఏదో చెప్పడానికుపక్రమిస్తున్నట్టు.

"నీ పుట్టిన రోజుకి బట్టలు కొనుక్కోవూ క్రిష్ణా! డాడీ ఇవాళ బజారుకు తీసుకెడతా నన్నారు. అంచేత మరే స్నేహితురాళ్ళకీ వెళ్ళకు." కామేశ్వరమ్మ చెప్పింది. అలిసి వచ్చి ఆకలితో టిఫిన్ మీద దాడి చేస్తున్న కూతుర్ని చూస్తే ఆవిడకి ప్రేమ పొంగి పోయింది. ఎందుకీ ఉద్యోగం? హాయిగా నీడ పట్టున ఉండక. నవనవ లాడుతూండే పిల్ల కాస్త చిక్కింది. చెబితే వినరు మరి. అడ్డాలో బిడ్డలుగానీ, గెడ్డాలొచ్చాకానా? పిల్లలు పెద్దవాళ్ళయి

... ఇష్టాలను బిడ్డలు గౌరవించాలని తెలిపిన కామేశ్వరమ్మ, మనసులోని మాట పైకి అనలేదు.

'నిధి వస్త్రాలయం' ముందు కారాగింది. ముందరి వైపు నుండి కామేశ్వరమ్మ, డ్రైవింగ్ సీట్లోంచి శర్మగారూ దిగారు. వెనుక సీట్లోంచి క్రిష్ణవేణి దిగింది కారు డోర్సన్నీ లాక్ చేసి షాపులో కెళ్ళారు. ప్రతియేడూ తన పుట్టిన రోజుకి రెండు చీరలు ష్యూర్. ఒకటి అన్నయ్య, ఒకటి నాన్నగారూను. ఈ యేడు తను తన స్వార్జితంలో కూడా ఓ చీర కొనుక్కోబోతోంది. నాది అని అనుకోగలిగిన ఈ అనుభవం వర్ణింప నలవికాదు. మూడు చీరలు! చీరలంటే స్త్రీ సహజమైన మక్కువ క్రిష్ణవేణికి కూడా ఉంది మరి. ఇంత సంతోషంలో కూడా ఒక్కసారి ఆరోజు ఆఫీసులోని సంఘటనలు జ్ఞాపకం వచ్చి కలుక్కుమంది ముల్లులా.

"రండమ్మా! ఈ మధ్య చాలా రోజులయి ఇటు రాలేదు తమరు. బాగున్నారా అమ్మా" షాపతను మర్యాదగా, పరామర్శిస్తూ లోనికి ఆహ్వానించాడు. చిరునవ్వుతో లోనికి ప్రవేశించారు. ట్యూబ్‌లైట్ల కాంతిలో ధగ ధగా మెరిసి పోతున్నాయి చీరలు. ఎయిర్ కండిషన్ చేయబడ్డ ఆ షాపులో చల్లగా ఆహ్లాదకరంగా ఉంది. చీరల సెలెక్షన్ మొదలు పెట్టింది ముందు చూపు గల తల్లి, పట్టుచీర కొన్నది — ముదురు ఆకుపచ్చరంగు చీరకు నారింజ పండు రంగు జరీ బార్డరుంది. రవి ఇచ్చిన డబ్బుతో తెల్లని అమెరికన్ జార్జెట్ చీర మీద ఎర్ర గులాబీలున్నది కొన్నది. తన డబ్బుతో ఏం చీర కొనుక్కోవాలి? ఏమీ తోచక కుంకం రంగు మీద జరీ బుటాలున్న వెంకటగిరి చీర ఎంచుకొంది.

"అరె! మీరిక్కడున్నారేమిటి విశేషం! ఇవాళ మిమ్మల్ని బాంకులో కలుద్దామనుకుంటే వీలవలేదు." వెనక్కు తిరిగింది. "మీ జడ చూస్తూనే పోల్చుకున్నాను." శర్మగారూ, కామేశ్వరమ్మా ముఖాలు చిట్లించారు 'వీడెవడా?' అన్నట్టు.

"ఈయన శ్రీనివాసులు అని మా బాంకి కష్టమర్ డాడీ." అంతకన్నా చెబుదామంటే క్రిష్ణవేణికే అతని గురించి యింకేమీ తెలియదు. "వీరు మా నాన్నగారు."

అందరికీ ఆగష్టు పదిహేనున స్వాతంత్ర్యం వస్తే
నేను మాత్రం ఆ రోజే నా స్వాతంత్ర్యాన్ని కోల్పోయాను
ఎందుకంటే ఆ రోజే నాకు పెళ్ళయ్యింది



"నమస్కారమండి! నే నిక్కడే బిజినెస్ చేస్తుంటాను. మాది మోటర్ సర్వీస్ సెంటర్- అదే లక్ష్మి సర్వీస్ సెంటర్ దాని ప్రక్కనున్న పెట్రోలు బంకూ మావే. మా బంకుకి రండి సార్! మేము కార్ సర్వీసింగూ అదే కాకుండా, రిపేర్స్, రోడ్ టాక్స్ అండ్ లైసెన్స్ రిన్యూవల్ అన్నీ చేసి పెడతాం." సడెన్‌గా వాసు బిజినెస్ మాన్‌లా మాట్లాడాడు. అతనిచ్చిన వివరాలు శర్మగారికి చాలా ఆసక్తి కలిగించాయి. మూడు నెలల కోసారి ఆర్‌టీవో ఆఫీసులోని క్యూల్లో గంటల తరబడి వృధా చెయ్యవలసి వస్తూంటుంది. వీళ్ళు ఆ పన్లు కూడా చేస్తారుట. బాగుంది అనుకున్నారు.

క్రిష్ణవేణి మిగతా జాకెట్లు సెలక్షనూ అదీ పూర్తి చేసుకొచ్చేవరకూ శర్మగారు వాసుతో ఏవో పిచ్చాపాటి కబుర్లతో కాలక్షేపం చేశారు. శర్మగారికి వాసు చాలా వచ్చినట్లు తోచింది క్రిష్ణవేణికి.

ఈ మాటు తన పుట్టినరోజు ఆదివారం నాడు పడినందుకు చాలా సంతోషించింది

## సామెతల కథలు

# గండం గడిచి పిండం బయటపడితే

ఆపద తప్పితే చాలు అన్న అర్థంలో యీ పలుకుబడిని ఉపయోగిస్తుంటారు.

ఎన్నో అధునాతన వైద్య సదుపాయాలున్న యీ రోజుల్లో కూడా "కాన్పు" అంటే భయమే. అదే మొదటి కాన్పు అయితే, అంతా ఎంత భయపడతారో చెప్పనవసరం లేదు. డాక్టరు జాగ్రత్తగా ఉండాలని హెచ్చరించినప్పుడు, ఆ గర్భిణీ స్త్రీ, ఆమె బంధువర్గం, ఎలా కంగారు పడిపోతుంటారో కూడా చెప్పనవసరం లేదు. అందుకే యీ నాటికీ, బిడ్డ బిడ్డకూ గండం అన్న భీతి అందరకూ ఉంది.

వెనుకటి రోజుల్లో—వైద్య సహాయం లేని రోజుల్లో— యూరిన్ టెస్టులూ, బ్లడ్ గ్రూపులూ, బ్లడ్ టెస్టులూ, మొదలగునవి తెలియని రోజుల్లో, ప్రాంతాల్లోని తెలిసీ, తెలియని మంత్రసానులపై ఆధారపడే కాలంలో, "కాన్పు" ప్రతి "కాన్పూ" గండంగా ఉండి ఉండేదనటంలో అతిశయోక్తి లేదు. కాన్పు అయితే చాలు గండం గడిచినట్లేనని అభిప్రాయపడేవారు. దానిపై వచ్చిందే యీ పలుకుబడి.

అలా చావుకు తెగించి, తన పొట్టను చింపి మరొకరికి జీవితాన్ని యిస్తుంది కాబట్టే స్త్రీ మూర్తిని దేవత అన్నారు. ప్రసవ వేదన సమయంలో, యమదేవుడొచ్చి, ఆమెను, నీవు వస్తావా, నీ బిడ్డను పంపుతావా అంటే, నేనే వస్తా స్వామీ, నా బిడ్డను కాపాడు అని, యముణ్ని కూడా కోరుకుంటుందట. స్త్రీ అలాంటి త్యాగమూర్తి.

— పద్మావతీ గంగాధర్




## భ్రమర పంచకం

చిన్న పిల్లలా సరదా పడుతున్న క్రిష్ణవేణిని చూసి శర్మగారూ, కామేశ్వరమ్మా నవ్వుకున్నారు. పార్టీ అంటూ ఎవరినీ పిలవటం అలవాటు లేక పోయినా సరదాకొద్దీ ఇంట్లో కేక్ చేసింది ప్రతిసారి లాగే. అందరి పుట్టిన రోజులకి ఆవిడ కేక్ చేయడం పరిపాటే. కానీ ఆవిడ పుట్టిన రోజున మాత్రం క్రిష్ణవేణి ఆవిడని ఆ రోజంతా ఏ పనీ చేయనియదు. ఉదయపు పనీ వంటా చేసి సాయంత్రానికి కన్వీనియెంట్‌గా అలిసి పోతుంది క్రిష్ణ. అది చూడలేక సాయంత్రం రవో లేక శర్మగారో ఆవూరిలో ఉన్న త్రీస్టార్ హోటల్ "చారిస్మా"లో డిన్నర్‌కి రిజర్వు చేయిస్తుంటారు. రొటీన్ ఇంతవరకూ మారలేదు.

ఆదివారం సాయంత్రం తల్లి కొన్న ఆకుపచ్చరంగు పట్టుచీర మీద అదేరంగు జాకెట్టు తొడుక్కుని, పచ్చరాళ్ళదుద్దులు, నెక్లెస్, చేతికి బంగారం గాజుల మధ్య అవే రంగు గాజు గాజులు వేసుకొన్న క్రిష్ణవేణి, వన కన్యలా మెరిసి పోతోంది శర్మగారు లాన్‌లో పడక కుర్చీలో పడుకొని విశ్రాంతిగా ఆ రోజు ఎక్స్‌ప్రెస్ ఆఫ్ ఇండియా చదువుతున్నారు. వాతావరణం చల్లగా ప్రశాంతంగా ఉంది. ఉండుండి చిన్న చిరుగాలి వీస్తోంది.

"నమస్కారం శర్మగారూ!" వాసు కంఠ స్వరం విని తలెత్తి పైకి చూసి "రండి శ్రీనివాసులు గారూ! పదండి లోపలే కూర్చుందాం" అంటూ లోపికి దారి తీశారు శర్మగారు అతన్ని సోఫాలో కూర్చోమని లోపలికెళ్ళి క్రిష్ణవేణితో "క్రిష్ణా శ్రీనివాసులు గారొచ్చారు" అనటం వినబడింది వాసుకి.

బాంకికి వచ్చేటప్పుడు అతి సామాన్యమైన అలంకరణతో ఎదుటి వ్యక్తిని ఎమడ దూరంలో ఉంచేటట్లుండే ఆమెకూ, ఇంటి దగ్గరి ఈ క్రిష్ణవేణికీ పోలికే లేదు. సర్వాలంకార భూషితురాలై దేవకన్యలా వెలిగి పోతోం దీమె. వాసు ఒక క్షణం పాటు ఆమె మీంచి చూపులు మరల్చుకోలేక పోయాడు. తదేకంగా తనను తినేసేలా చూస్తున్న వాసుని చూసి చికాకు పడింది క్రిష్ణవేణి.

"మెనీ హాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే" అంటూ ఒక చిన్న పాకెట్ అందించాడు. అది విల్సన్ పెన్ సెట్.

"థాంక్యూ, బట్ యూ నీడ్ నాట్ హేవ్ బాదర్డ్" అంటూ టిఫిన్ తెచ్చే నెపం మీద లోని కెళ్ళి పోయింది.

కేక్ పీస్, ఆలూ బోండా చట్నీ, బర్ఫీలు రెండు రకాలూ, ఉప్మా ప్లేటుమ ఖాళీచేసి, తృప్తిగా కాఫీ తాగి కాసేపు శర్మగారితో మాట్లాడి వెళ్ళడాని కుద్యుక్తుడయ్యాడు.

"విన్నిసార్లొచ్చినా ఇంత వరకూ రవి గారిని కలవటమే పడలేదండి" అన్నాడు వాసు.

"సాయంత్రమయ్యేసరికల్లా ఆస్కూటర్ మీద ఎక్కడికో వెళ్ళందే తోచదు వాడికి. మిమ్మల్నోసారి కలవమని చెప్తాలెండి. ఇవాళ పిక్చర్‌కి టికట్స్ బుక్ చెయ్యడానికివెళ్ళాడు. అన్నట్టు స్కూటరంటే జ్ఞాపకం వచ్చింది. నా కారుదీ, రవి స్కూటరుదీ కొంచెం రోడ్డు టాక్స్ కట్టించి పెడతారూ? మీ బంక్‌లో తరువాత మెంబరవుతాను"అంటూ డబ్బు తేవడానికి లోపలి కెళ్ళారు శర్మగారు.

"తప్పకుండా" అని వాసు క్రిష్ణవేణి వంక తిరిగి అన్నాడు "అన్నట్టు చెప్పడం మరిచిపోయాను. నేను... పత్రికకు పంపిన సుభాషితాలు ప్రచురిత మయ్యాయి. ఆ పత్రికకు అప్పుడప్పుడు ఉత్తరాలు కూడా వ్రాస్తూంటాను. తప్పక చదవండి."

వచ్చే నవ్వు నాపుకుంటూ "ఆ పత్రిక మేము కూడా కొంటాము. ఏ వారం నంచికో చెప్పండి" అంది క్రిష్ణవేణి.

మధ్య నున్న టీపాయ్ మీద నుంచి ఓ పత్రికను ఇవతలికి తీసి "ఇదిగో ఇందులోనే ఉన్నాయి" అని జవాబిచ్చేంతలో కారు పాస్ బుక్కు, స్కూటరు కాగితాలూ, నూట ఏభై రూపాయలూ తీసుకుని శర్మగారు వచ్చారు.

"సారీ ఫర్ ది ట్రబుల్. బట్ వీా బంక్‌లో మొదలు పెట్టిన ఈ సర్వీస్ చాలా ఉపయోగకరమైనది" అంటూ అభినందించారు.

వాసు వెళ్ళి పోయాడు. వినిమిదయింది. రవి టిక్కెట్లతో వచ్చాడు. ఆకళ్ళు లేవంటూ విరూ భోజనాలు చేయలేదు. "వర్టిగో" అనే హిచ్ కాక్ ది, ఇంగ్లీషు సినిమా చూసి వచ్చారు. బట్టలు మార్చుకుని నైటీ తొడుక్కుని నిద్ర పట్టక, వాసు చెప్పిన పత్రిక తెచ్చి సుభాషితాల కోసం వెదక పారంభించింది క్రిష్ణవేణి. అన్నీ ప్రేమని గురించి నవే అందులో ఒక్కటి మాత్రం క్రిష్ణవేణికి కోపం తెప్పించింది.

"ముద్దు రహస్యంగా పెట్టుకున్నప్పుడే దాని తీయదనం ఎక్కువ సేపు జ్ఞాపకముంటుంది." "స్టుపిడ్" అని తనని చదవమనడంలో వాసు ఉద్దేశ్య మేమిటి? కోపంగా సణుక్కుని, ఆ పుస్తకాన్ని గిరాటేసి లైటార్పి, అదేకోపంలో పడుకుని నిద్ర పోయింది.

అదే సమయంలో -

"ఆ వాసుని మీరు పిలిచారా" కామేశ్వరి శర్మగారి నడిగింది.

"లేదే! క్రిష్ణ పిలిచిందేమో నను కున్నాను. ప్రెజెంట్ కూడా తెచ్చాడుగా అందుకని." శర్మగారి జవాబుకు కలవర పడుతూ తిరిగి అంది కామేశ్వరి.

"మీరేపిలిచారని అది అనుకుంటోంది."

"చూడు కామూ, క్రిష్ణవేణి అందరిలా కాదు. బాధ్యతలు తెలిసిన పిల్ల. అంచాత ఎవరైనా దాని వెంట పడ్డా లేదా స్నేహం చేసినా, దాని మంచి చెడ్డలు చూసుకో గలిగిన ప్రాజ్ఞురాలు. డోంట్ వరీ" అంటూ శర్మగారు సముదాయించారు.

కానీ సున్నిత మనస్కురాలయిన క్రిష్ణవేణికి, వాసు రాక, అతని చొరవా, అసహ్యాన్నీ చీకాకునీ పెంచాయే కానీ, కనీసం స్నేహధర్మంగా మాటాడాలనయినా అనిపించలేదు. విసుగ్గా ఉన్న మూడ్ లోనే ఆఫీసుకు బయల దేరింది. బస్సులో జాగా లేదు ఆటో. కిక్కిరిసి ఉంది. రెండు స్టాపుల తరువాత బస్సులోకి కష్టపడి ఎక్కిన ప్రభాకర్రావును చూసి ఆశ్చర్య పోయింది.

"మీ కారు కేమయింది ?" ప్రశ్నించకుండా ఉండలేకపోయింది.

"చిన్న రిపేరొచ్చింది నిన్న. వాసు వాళ సర్వీసు గారేజీలో ఉంది." అంటూ దగ్గర కొచ్చి తగులూ నిలబడ్డాడు. తరువాత స్టాపులో మరింత మంది ఎక్కారు తోసుకుంటూ. క్రిష్ణవేణిని రాసుకుంటూ వెళ్ళాలని చూస్తున్న కాలేజీ కుర్రాళ్ళని కోపంగా చూస్తూ ప్రభాకర్రావు చటుక్కున ఆమె చుట్టూ చెయ్యి వేసి కొంచెం దగ్గరికి లాక్కున్నాడు.

"ఆ మొగ వెధవ లందరూ నీమీద పడి పోతున్నారు" అంటూ తన చర్యను సమర్థించాడు ప్రైగా.

తను మాత్రం మగవాడు కాదూ? ఆఖరికి తన అన్నయ్య లాంటి ప్రభాకర్రావు కూడా ఇదేం ప్రవర్తన ? అతను చేసిన ఈ పనికి క్రిష్ణవేణి చాలా బాధ పడింది. బాంక్ స్టాప్ రాగానే అతని కొరకు ఆగకుండా గబగబా నడిచింది పీడ వదిలించుకోవాలన్నట్టు.

ఆ రోజు బాంక్‌లో అందరితోనూ అంటీ ముట్టనట్లే ఉంది. సాయంత్రమవుతూంటే వాసు వచ్చాడు. అతి సంతోషంగా క్రిష్ణవేణి వైపుకి రాబోయి, ఆమె ముఖం చూసి ఏదో తప్పు చేసిన వాడిలా అయి ప్రక్కనే ఉన్న సాగర్ కేసి వెళ్ళాడు.

"సాగర్ గారూ! నా ఎకౌంటులో ఎంత బాలన్సుందో చెబుతారా" వాసు ప్రశ్నించాడు.

"ఒక్క నిముషం. క్రిష్ణవేణి గారూ జస్ట్ మినిట్" అంటూ ఆమె తల ఎత్తే





## భ్రమర పంచకం

లోపునే ఆమె కూర్చున్న కుర్చీ వెనక చెయ్యేసి ఆమె వీపు మించి లెడ్జర్ బుక్‌లోకి చూడ సాగాడు. క్రిష్ణవేణి కోపంతో ఊగిపోయింది. చురుకుని లేచి నిలబడింది. ఏమిటి వీళ్ళ ఉద్దేశ్యం? తాను ఎవరనుకుంటున్నారు? ఉన్నట్టుండి లేచేసరికి, వంగి వున్న సాగర్ గెడ్డానికి ఆమె తల కొట్టుకుంది బలంగా కస్సుమని నాలుక తెగింది.

"ష్! చచ్చాను" అంటూ నోటిమీద చేతి నుంచుకొని వాష్ బేసిన్ వైపు పరుగెత్తాడు సాగర్.

రెండు చేతుల్లోనే బరువుగా ఉన్న ఆ బుక్కును సాగర్ డెస్క్ మీద ఎత్తి దబీమని పడేసింది.

"ఎస్‌బి ఎకౌంట్లు చూసేది నేను. అడ్డమైన వారినీ విందు కడుగుతారు" నిప్పులు కురిపిస్తూ వాసుతో అంది క్రిష్ణవేణి. నోట మాట రాక పిచ్చివాడిలా చూస్తున్నాడు వాసు. చక్రవర్తి, బాపూజీ, రామక్రిష్ణ ఆత్రుతగా గమనించ సాగారు. తిరిగి తన సీట్లో కూలబడి గబగబా రిజిగ్నేషన్ లెటర్ గిలికి పడేసింది. ఎగిరి పోకుండా పేపర్ వెయిట్‌ను గట్టిగా శబ్దం చేస్తూ పెట్టింది. బాగ్ తీసుకుని గుమ్మం వరకూ వెళ్లేసరికి ఏదో గొడవ జరుగుతోందని గ్రహించిన ప్రభాకర్రావు తనరూం లోంచివతలకు వచ్చాడు. ప్రశ్నార్థకంగా అందరి వంకా చూశాడు. అందరూ అపరాధుల్లా తలలు వంచారు రామకృష్ణ మాత్రం దగ్గరకు వచ్చి క్రిష్ణవేణి రాసి పెట్టిన కాగితం తీసిచ్చాడు తనకంతే తెలిసిందన్నట్లు. గబగబా చదివాడు ప్రభాకర్రావు.

"మీరందరూ నామీద చూపిన అభిమానం మరువలేను. థాంక్స్" అంటూ గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోతున్న క్రిష్ణవేణిని ఆపేశక్తి లేనట్లు అతని తల వంగిపోయింది.

* * *

టాక్సీలో కూర్చున్న క్రిష్ణవేణి మనసంతా చికాకు, ఉడుకు మోత్తనంతో, కోపంతో బుసలు కొడుతోంది. తనుయితే తన తల్లితండ్రుల అండ చూసుకుని ఉన్నపళంగా ఉద్యోగం మానేసింది. మరి అవసరానికి ఉద్యోగినులయిన ఆడవారి మాటేమిటి? ఆమె మనసులోని ప్రశ్న ప్రశ్నగానే మిగిలిపోయింది.

(అయిపోయింది)

పి. డి. పి., డి. ఏ. ఆర్. పల్లిసారధి.

నాకు ఓ అమ్మాయి పరిచయం అయ్యింది. రోజూ నన్ను చూస్తుంది. నేను కూడా చూస్తాను. ఆ అమ్మాయి నన్ను ప్రేమిస్తోందా? లేక నేను అమ్మాయిని ప్రేమిస్తున్నానా?

నన్నడిగితే ఏం చెప్తాను - [illegible]

జి. వి. పి పెన్నూరు.

దిక్కులేనివాడికి దేవుడే దిక్కు అన్నారు. మరి దేవుడు కూడా దిక్కులేనివాడేకదా. అతని కెవరు దిక్కు?

పూజారి.

వీర్. సామర్లకోట.

వరకట్నం తీసుకోకూడదని మా [illegible] కుర్రాడు దీక్షించుకుని కార్యంలో అతని తల్లిదండ్రులు కట్నం లేకుండా పెళ్ళి చేశారు. ఇప్పుడు అతన్ని అంతా ఏమంటున్నారో తెలుసా? అతనికేదో లోపం ఉండని, అందుకే కట్నం తీసుకోలేదని.

మరి స్వంత విషయాలు ఇలా పబ్లిక్ నాటకం ఆడటంవల్ల వచ్చే గొడవలే ఇవి. లోతులేని చోట్ల నీళ్ళెగసల ఎక్కువ ఉన్నట్లు మరి [illegible] ఇలా గోల చేసుకుంటే అంతే అవుతుంది. కట్నం తీసుకోక పోవడమే ఘనకార్యం అనుకుంటే ఎలా? చాలామంది పెద్దలు [illegible] కట్నం లేకుండా డబ్బు ప్రసక్తిలేని పెళ్ళిళ్ళు చేస్తూనేవున్నారు. కట్నం ఇవ్వలేదోయ్! కట్నంపుచ్చుకోలేదోయ్! అని ఇల్లెక్కి కోడిలా కూస్తే బెడిసికొడుతుంది. పెళ్ళికి పిల్లా పిల్లడూ వారి ఇష్టాయిష్టాలూ ముఖ్యం. మిగిలిన వన్నీ సెకండరీ.

# వారఫలం

**3-8-1979 శుక్రవారం మొదలు**
**9-8-1979 గురువారం వరకు**

**మేషం :** అన్ని రంగాలలో అనుభవసిద్ధముగా లాభ సంపాదన చేకూరుతుంది. ఇటీవల చేసిన ప్రయత్నాలలో, రచనా వ్యాసంగాలలో ఎవరెవ్వరికి తృప్తికరంగా ఉండటమేగాక లాభదాయకంగా ఉంటుంది. ప్రతిదినం ఈ నెలం రాబడి అభివృద్ధి సూచించబడుచున్నది. ఈ రాశివారికి గ్రహస్థితి వ్యాపారం, కళారంగంలో గౌరవం, సన్మాన సభలు పొందుతారు. స్త్రీలకు : సర్వతో ముఖాభివృద్ధి.

**వృషభం :** కుజగ్రహస్థితివల్ల అనారోగ్య సూచనలు, అసంబద్ధ ప్రలాపాలు, అప్రవృత్తి సంభాషణలు, అనవసరంగా కీచులాటలుంటాయి. మొగవాళ్ళకు పోవద్దు. ఇచ్చిపుచ్చుకునే విషయాల్లో ఎంతో జాగ్రత్త వహించాలి. అర్ధాష్టమ శనిరాశిరీత్యా అదృష్టదాయకమే. లాభం లభించుతుంది. స్త్రీలకు : కళా రంగానుభవంగల వారికి, చలనచిత్ర రంగంలో విహరించే వారికి సానుకూలం.

**మిథునం :** ధనం రావాలి, వ్యాపారం చేయాలి, అనుకోవటం తప్పులేదుగాని. రాబడి ఆశించినంతరాదు. భూ సంబంధమైన వివాదాలుంటాయి. అగని పనులకు పోవటం, జోక్యం కలిగించటం ఏమంత మంచిదికాదు. హాయి, ఆనందం చిక్కాలని ఆశ ఉండటం న్యాయంగాని, గ్రహస్థితి ఏమాత్రం అందుకు ఒప్పుకోదు. స్త్రీలకు : న్యాయంగా, క్రమంగా జరుగవలసిన పనులు కూడ నెరవేరే ఉపాయంలేదు. వారాంతం సుఖానుభవం ఉన్నది.

**కర్కాటకం :** శాంతం ఎంతవహించినా, పనులలో ఎంత నేర్పరితనం చూపించినా, నలుగురి వైపులా ఎంతగా ప్రాకులాడినా, అనుకున్న పనులు, అనుకున్నట్లు నెరవేరవు. మానసికంగా బాగుంటుంది అని చెప్పడానికి వీలులేదు. ఒక్క రాహువే చాలు, ఇబ్బందులు కలుగ చేయుటకు. పై గ్రహాలకి 2లో వేస్తున్నాడు. ఇంకా కొంతకాలం ఓపికపట్టితేగాని, ఎనిమిదింటా ఫలసిద్ధి రస్తు - అవటానికి వీలులేదు. స్త్రీలకు : మెలకువ వహించే ఓపికతో పనులు చేసుకునేటట్లు ప్రయత్నించండి. ఉద్యోగంలో ప్రమోషన్, లావాదేవీలలో లాభం సమకూడుతుంది.

**సింహం :** శని రాహువులవల్ల ఏ పనులు చేయడానికి ప్రయత్నించినా, ఎంత ముందుకు పోవాలని ఉబలాటపడినా, ఎవరి సహాయం అర్థించినా కలసిరాని వారం. పనుల జోలికి పోరాదు అనను గాని బాధ్యతాయుతంగా వ్యవహరించటం మేలు కాదు. పెద్ద పెద్ద వ్యవహారాలలో జోక్యం చేసికోరాదు. బంధు వర్గీయులు సాన్నిహిత్యానికి పోరాడు. స్త్రీలకు : కొంచెం నిదానించిన మంచిది.

**కన్య :** ప్రశాంత జీవనం గడపాలి, మంచి రోజులెప్పుడు వస్తాయి అని ఎదురు చూస్తుంటారు. కొన్ని వారాల్లో కొంత తీరుతుంది. వారం రెండవ భాగం యోగదాయకం. అనుకూలప్రదం. ఆనందదాయకం. స్త్రీలకు : దైవపుణ్య కార్యాలు మాత్రం చక్కగా నెరవేరతాయి.

**తుల :** అనుకూలకాలం. అందుకు తగిన గ్రహస్థితి అత్యుత్తమ కాలం చేరువనే ఉన్నదని గ్రహించి, అందుకొరకు తగిన శక్తియుక్తులు ప్రదర్శించి వ్యాపార విస్తరణ కార్యక్రమం చేపట్టండి. ఉద్యోగాభివృద్ధి, వ్యాపారానుకూలత గలవారం. గౌరవ ప్రతిపత్తి గల కార్యరంగానికి సిద్ధమౌతారు. స్త్రీలకు: తలచిన పనులు, తలంచినట్లుగా నెరవేరుతాయి.

**వృశ్చికం:** సుఖశాంతులు లోపిస్తాయి. నిరుత్సాహం వెంట నుంటుంది. పనుల జోలికి పోవాలంటేనే భీతి ఏర్పడుతుంది. అందువల్ల సుధావిధిగా నెరవేర్చే పనులకే ఇబ్బంది కల్గటం కూడా సంభవం. బంధు వర్గీయుల రాకపోకలు, తద్వారా వ్యయం సూచితం. స్త్రీలకు: గృహావసరం కోసం ప్రాకులాట, ఉద్యోగంలోని వారికి అభివృద్ధి ఏర్పడుతుంది.

**ధనుస్సు :** మాటకు మన్నన గౌరవ లభ్యమే కాక, మనసులో తలచిన పనులు నెరవేరి, అందు మూలాన ఆదాయం లభించటం జరుగుతుంది. చాల రోజులుగా ఎదురు చూచేధనం చేతికందటం, అందు మూలాన తలచిన పనులు నెరవేరటం గ్రహానుకూలత వలన లభ్యం. గోచారకేతువు సర్వ విధాలా యోగప్రదుడు. స్త్రీలకు: గృహావసరం. ఉద్యోగ లాభం శుభ సంతోషాలకు ఆకరమైనవారం.

**మకరం :** గత వారానికన్నా ఈ వార ఫలం ఫలదాయకమని గ్రహించగలుగుతారు. అట్టి సన్నివేశం ద్రవ్య సంబంధమైనది చేజిక్కే అవకాశం ఉన్నది. పెద్దల సంపర్కం అభిమానపూర్వక ఆదరణ చేయూతనిచ్చిన ప్రయత్నం సానుకూలం కావటం ఒక ముఖ్య లక్షణం. స్త్రీలకు: అన్ని విధాల అన్నిరంగాల్లోని వారికి లాభకారం.

**కుంభం :** ముందుకు పోవాలని ప్రయత్నించే ప్రకృతి, చేపట్టిన కార్యక్రమం సమగ్రంగా క్రమంగ సాంతమయ్యేదాకా వదలరు. కాని అనారోగ్యత వల్ల కొంచెం ముందు వెనుకలకు పోవటం సహజం. పనులు నెరవేరే గ్రహస్థితి కలదు గనుక వెనుకాడకండి. సాగిపోండి. ద్రవ్యాదాయం సమకూడుతుంది. స్త్రీలకు: వైరాగ్యప్రారంభం అయ్యే వారం ఇది. ఉద్యోగంలో అభివృద్ధికద్దు.

**మీనం :** మంచి మాటలతో, సదా మంచి యోచనలతో ముందుకు సాగిపోవటం వినా ప్రత్యేకంగా రాశిని ఉచ్చగురువు వీక్షించడం మరీ యోగదాయకం. చేతికి రాక నిలిచిన ద్రవ్యం అందుతుంది. పనులు నెరవేరుతాయి. చిన్న ప్రయాణ సూచన వున్నది. మానుకోండి. అందువల్ల అనుకున్న కార్యం అలాగే నెరవేరుతుంది. స్త్రీలకు: చిత్రకళ చలనచిత్ర రంగంలోని వారికి, పత్రికా రచయితలకు ఉత్సాహకాలం.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

## యు కె. అంటే ....?

కర్ణాటక రాష్ట్రంలో దక్షిణ కెనరా, ఉత్తర కెనరా అనే జిల్లాల పేర్లు మార్చి, ఉత్తర కన్నడ, దక్షిణ కన్నడ అని పెట్టి ఆ పేర్లను ముద్దుగా యు. కె., డి. కె. అని అన్నారట. అంకోలా [ఉత్తర కన్నడ]లోని వో ప్రభుత్వోద్యోగికి రాసిన ఉత్తరం ఎడ్రసులో అంకోలా, యు. కె. అని రాయడంవల్ల ఆ ఉత్తరం కాస్తా యు. కె. ఇంగ్లండ్ వెళ్లిపోయి, తన సొంతదారుని ఎందూ గానక ఆకాశయానంతో విసిగి, భూమ్మీదవాలి పది నెలల ప్రయాణం తరువాత తిన్నగా హిందూ దేశంలోని అంకోలా ఉత్తర కర్ణాటకకు వచ్చి చేరిందట.

## పెళ్లి కొడుకు వింత కోర్కె!

గ్వాలియరుకు చెందిన పిలో అనే గ్రామంలో పెళ్లి జరుగుతోందట. పెళ్లి తతంగం అంతా అయ్యాక శోభనం తంతు ఆరంభమయ్యేసరికి పెళ్లికుమారుడు స్ట్రైక్ పరిచి, తాను కోరినది నెరవేరితేగాని యీ శోభనం జరుగనివ్వనన్నాడట. పెళ్లికూతురు తరఫువారు, ఆమె తండ్రి వీర ప్రత్తై ఏమి కోర్కె అయినా చెప్పు. నెరవేరుస్తా మని ఏకకంఠంతో పలికారట. పెళ్లి కూతురు తండ్రిచేత వాగ్దానం చేయించుకున్న తరువాత 'మీరిహమంచి పొగ త్రాగవని మాట యివ్వాలి. ఈ బీడీ, సిగరెట్లువల్ల మీ ఆరోగ్యం దెబ్బతింటోం దని నాకు ఓ అమ్మాయి చెప్పింది," అన్నాడట కాబోగా. ఈ వింత కోర్కెకు ఆశ్చర్యపోయి, తేరుకున్నాకసరి అని ఒట్టువేశాడటా పెళ్లికూతురు తండ్రి. తన కోర్కె నెరవేరినందుకు పెళ్లి కొడుకు తాను తీసుకున్న కట్నాన్ని వాపసు యిచ్చేశాడట. హా!



## జంతువుల వూరేగింపు!

జిల్లా జంతు సంరక్షక ఇన్స్పెక్టర్లు [అలా సమాసం చెయ్యొచ్చా!] తమిళనాడుకు చెందిన సేలంలో వడివీధులలో వూరేగింపుగా వెళ్లారట. వారితోపాటు కుక్కలు, గాడిదలు, ఆవులు, ఎద్దులు, కోతులూ కూడా పాల్గొన్నాయట. వూరువూరంతా వింతగా చూసి వినోదించారట. ఈ తతంగం అనంతరం వీరికోర్కెల మహజరును ఒకకోతి పట్టుకుపోయి జిల్లా కలెక్టరు యస్. పార్థసారథిగారికి సవినయంగా సమర్పించిందట.

## అడగటమే తప్పా?

తమిళనాడుకు చెందిన పెరియ గౌండంపాళెంలో సుబ్బరాయ గవుండరు అనే అతని పొలంలో పక్కపొలం సొంతదారు ముత్తుసామి గవుండరు మన్ను పోశాడట. తన పొలంలో మట్టి త్రవ్వి, ఆ మన్నంతా ఎత్తి సుబ్బారాయ గవుండరు పొలంలో పోయిస్తే ఇదేమి విపరీతం అని సుబ్బరాయ గవుండరు ముత్తుసామి గవుండరు కొడుకు రాజాని నిలదీసి, ఎన్నడా యుడి అనే పరిశా కుర్రడు చేతిలోని కొడవలితో సుబ్బరాయ గవుండరును నరికి చంపేశాడట.

## అంతిమ యాత్రగా మారిన హనీమూన్ యాత్ర!

మహేంద్ర ధారియా అనే అతనూ, అతని భార్య వసంతాక్ కొత్తగా పెళ్లయిన దంపతులట. వారిరువురు హనీమూన్ యాత్రగా బ్రసెల్స్ వెళ్లి, అక్కడో హోటలులో రూము అద్దెకు తీసుకున్నారట. ఆనక వారిరువురూ కనబడలేదట. వారు తీసుకున్న గది బాత్ రూమ్‌లో రక్తపు మరకలు కనిపించాయట. ఆ హోటలు వెనక ప్రక్కనున్న చెత్తకుండీలో ఒక స్త్రీ తల, చేతులు, కాళ్లు కుక్కలు పీకుతుండగా పోలీసులు వాటి నదిలించి ఆ అవయవాలు దక్కించుకున్నారట. ఆ ఆరెన్ బర్గ్ హోటలునుంచి ఆ దంపతులు కనబడక



జర్మనీలోని 'స్టట్‌గర్ట్-ఆటోబాన్' వంతెన పారిస్, ప్రేగ్‌లను కలుపుతుంది. ఈ సంవత్సరం తరువాత పూర్తికానున్న ఈ వంతెన నూతన పోకడలతో యూరోపులో తయారైన ఏకైక కాంక్రీటు వంతెన అని చెప్పవచ్చు. ఇది 185 మీటర్ల ఎత్తు, 1128 మీటర్ల పొడవు వుంటుంది. దీని అడుగున వున్న తొమ్మిది స్తంభాలలో కొన్నింటికి భూమిలో సుమారు 45 మీటర్ల పునాది వేయబడినది. ఉక్కు వంతెన కన్నా దీన్ని కట్టడానికి 15 శాతం తక్కువ ఖర్చు ఆయింది. మరమత్తుల ఖర్చులు కూడా చాలా తక్కువగా ఉంటాయట.

**వనితలకు మనవి**

కొత్తరకం వంటలు క్లుప్తంగా వ్రాసి పంపితే త్వరగా పరిశీలించ వీలు —సం.



# ఫాలాక్షుని డైరీ

పోడం, ఆ హోటలు వెనుకనే స్త్రీతల. కాళ్లు చేతులూ విడిగా దొరకడం కలిపి, ఒహాచేళ యూ అవయువాలు సమితారా వేమోరని పోలీసువారి నొందట. సమితార్ బ్రిటిష్ వనిత. ఆమెభర్త మహేంద్ర ధారియా హైదవుడట. ఇంతకూ ఆ దొరికిన అవయువాలకు చెందిన శరీరం వేరే క్కడైనా దొరుకుతుందేమోనని పోలీసులు గాలిస్తున్నారట.

## ఎంతైనా పెద్దవాళ్లు పెద్దవాళ్లే !

కేరళ విశ్వవిద్యాలయం నిర్వహించిన ప్రియూని వర్సిటీ పరీక్షలలో యీ ఏడు 55 సంవత్సరాల వయస్సున్న అన్నమ్మ అనే ఆవిడ ప్రథమశ్రేణిలో ప్యాసయ్యిందట. ఆమె పదిహేడేళ్ల కూతురు రెండో తరగతిలో ప్యాసయినదట. అన్నమ్మ 39 సంవత్సరాల క్రితం ఇంటరు తప్పి ఆనక వైవాహిక జీవితంలో పడ్డదట. అనాడు తనకు ఏనాటి కయినా యీ పరీక్ష ప్యాసవ్వాలనే కోర్కె వున్నదనీ, 39 ఏళ్ల తరువాత తన ఆఖరి కూతురుతోపాటు తానూ చదవాలనే కోర్కె కలిగిందనీ ఆవిడ చెప్పిందట. తన మనవలతోనూ, మునిమనవలతోనూ, యీ వార్తలోనూ ఆవిడ తన సంతృప్తిని, సంతోషాన్నీ వెలిబుచ్చిందట.

## బ్యాంకాక్ హల్వా !

బ్యాంకాక్‌నుంచి కలకత్తాకు వచ్చి వాలిన విమానంలో దిగిన వో భారతీయుడు తన జిప్పు బ్యాగును తెరచి కస్టమ్స్ అధికారులకు చూప నిరాకరించాడట. వాట్సాన్ అని అధికారి ఒహాయన విస్తుపోతే కావాలంటే బ్యాగు నొక్కి చూడవచ్చు అన్నాడట ఆ వచ్చినాయన. బ్యాగు నొక్కిచూస్తే మెత్తమెత్తగా చేతికి తగిలేసరికి ఏమిటంత మెత్త మెత్తగా వుందీ అంటే బ్యాంకాక్ హల్వా సామ్మ న్నాడట. కానీ అది హల్వాలా లేదని, జోకులకు అది సమయం కాదనీ ఆ అధికారి భట్టున జిప్పు లాగేసరికి, స్ప్ అని వో తాచుపాము తలెత్తి హవ్వారియ్యా అని అడిగిందట. ఈ అను కోని హల్వారూపంచూసి ఎగిరిగంతేసిన అధికారి ఆ స్థితిలోంచి మామూలు స్థితికి వచ్చి ఎంచుర్ క్యాష్టర్రూల్సును ఉల్లంఘించినందుకు వొయ్యాజై రూపాయిలు ఫైను వేసేరట. వెరీ... వెరీ ఫైన్!

## అవమానం భరించలేక ఆత్మహత్య !

ఛండీఘర్‌లో కొత్తగా పెళ్ళయిన వో యువ కుడు తన చొక్కా విప్పి ప్రేమగా భార్యచేతిలో పెట్టి, "వోహ్ రాణీ యీ చొక్కా వుతికిఅరేయ్" అన్నాడట ప్రేమ సామ్రాజ్యంలోని వసారాలో కాల్చోబోతూ. కానీ అతను వూహించినట్టు మహా ప్రసాదం స్వామీ, అనిఆమెఆ చొక్కా గ్రహించక, ఎగిరి గంతేసి, "నీ చొక్కా లాగూ ఉతకడానికి పేనేం నీ పనిమనిషినా.... ఛుత్...." అని చీత్కరించిందట. ఈ అవమానాన్ని సహించలేని ఆ మానవధముడు టక్కువ పురిపోసుకు చనిపోయాడట.




పోస్టుకార్డు పుట్టి నూరు సంవత్సరాలైంది. ఈ సందర్భంగా విడుదల చేసిన తంతి తపాలా శాఖ వారి 50 పైసల స్టాంపు బొమ్మ — ఇంకా పోస్టుకార్డు ధర 50 పైసలు కాలేదు.

**బాల శివ యోగి ఖండన !**

ఆంధ్ర విశ్వ విద్యాలయ వ్యవహారాలలో జోక్యం చేసుకొని విద్యార్థులలో కలతలు తెస్తున్నారని శ్రీ బాలశివయోగిపై ఇటీవల చాల విమర్శలు వచ్చాయి. శ్రీ బాల శివ సేవాసమితికి ఆధ్యాత్మిక ప్రచారం, ప్రజాహిత కార్యక్రమాలు చేయడం తప్ప ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎలాటి సంబంధమూ లేదని శ్రీ బాలశివయోగి జూన్ 26 వ తేదీన పత్రికా ప్రతినిధులకు తెలిపారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో శాస్త్రవేత్తల సమావేశానికి బాలశివయోగి అధ్యక్షత వహించడం కూడ విమర్శ పాత్రమయింది. శాస్త్రానికి, సైన్సుకు తేడా ఏమిటి ? ఆధ్యాత్మికులు శాస్త్రవేత్తల సమావేశానికి హాజరు కావటం తప్పా ? అని ఆయన ఎదురు ప్రశ్నవేశారు. ఈ సందర్భంలో నాకు అర్ధ శతాబ్ది క్రితం సూర్యనమస్కారాలు, యోగాసనాలు ప్రదర్శిస్తూ, ఆధునిక అనాటమీ, ఫిజియాలజీ లతో సమన్వయ పరచి ప్రచారం చేస్తూ, దేశమంతా పర్యటించిన అపుంధ్ సంస్థానాధిశుడు జ్ఞాపకం వస్తున్నాడు. ఆయన ప్రతిపట్టణానికీ తన కుమార్తెలతోపాటు వెళ్లి ప్రాచీన యోగ శాస్త్రాన్ని ఆధునిక శాస్త్రాలతో సమన్వయం చేస్తూ ప్రసంగించేవారు. ఆధునికులు ప్రశ్నల వర్షం కురిపించేవారు, ఆ ప్రసంగాల ప్రభావం తోనే కాబోలు, డాక్టర్ పాకాల రామన్నారు ఒకప్పుడు మద్రాసులో అఖిలభారత మెడికల్ కాన్ఫరెన్సుకు ప్రారంభోత్సవం జరుపుతూ, యోగ శాస్త్రంలోని సహస్రారమణి కర్ణికాది చక్రాలను, ఆయుర్వేద శాస్త్రంలో వున్న నాడి విజ్ఞానాన్ని ఆధునిక దృష్టితో పరిశీలించాలని సూచించారు. శ్రీ బాలశివయోగి అన్నట్లు ప్రాచీన ప్రాచ్య శాస్త్రాలకు, నవీన పాశ్చాత్య శాస్త్రాలకు వైరుధ్యమేమీలేదు. మన శాస్త్ర ప్రగతి ఏకారణం వల్లనో కొన్ని శతాబ్దాల క్రితం ఆగింది. పాశ్చాత్యులు దానిని అందుకొని గొప్ప ప్రగతిని సాధించారు. మనం ఆ ఫలాలను అనుభవించి ముందుకు పోవడం అవసరం.

**ఆర్. ఎస్. ఎస్‌కు ప్రశంస :**

ఒకవైపు ఇందిరాగాంధి మున్నగువారు ఆర్. ఎస్. ఎస్. పై దుమ్మెత్తిపోస్తుండగా, ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి జూన్ 29 న విధాన పరిషత్తులో ప్రసంగిస్తూ, 1977 తుఫానులో దివితాలూకాలో తుఫాను బాధితులకు గృహాలు నిర్మించే కార్యక్రమంలో ఆర్. ఎస్. ఎస్. గణనీయమైన సేవచేసిందని ప్రశంసించడం కొందరు కనుబొమలు ఎగురవేయడానికి కారణమైనా ఆయన గుణగ్రహణ పారీణతకు తార్కాణం. శత్రువులోని గుణాన్ని గ్రహించేవాడే నిజమైన నాయకుడు. తప్పును తప్పుగా చెప్పడం తనవారు చేసినా, ఒప్పును ఒప్పుగా గ్రహించడం పరవారుచేసినా, గొప్ప నాయకుని లక్షణం.

# హైదరాబాద్ నోట్‌బుక్

**ఉన్న కర్మలో ఉపాకర్మ :**

రాష్ట్రంలోని పాలక పక్షంలో అసంతృప్తుల సంఖ్య పెరిగిపోతుండగా, ఉన్నకర్మలో ఉపాకర్మ అన్నట్టు కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీ దేవరాజ అరసు శ్రీమతి ఇందిరాగాంధితో తెగతెంపులు చేసికొని, కాంగ్రెస్ సమైక్యానికి, 1969 లో జరిగిన చీలికనాటి పరిస్థితి ప్రాతిపదికగా ఏ. ఐ. సి. సి. ని ఏర్పాటు చేయడానికి పూనుకొని జులై 4 వ తేదీన బెంగుళూరులో జరిగిన సదస్సు, మరికొన్ని పరిణామాలకు దారితీసింది. ఈ సదస్సుకు శ్రీ కె. వి. కేశవులు మున్నగువారు దాదాపు 65 మంది హాజరయినట్లు ఈ సదస్సు నిర్వాహకులలో ఒకరు, కర్ణాటక కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ కార్యదర్శి శ్రీ డి. జయదేవరాజ అరసు వెల్లడించారు. ఇతర రాష్ట్రాలలోని, రాష్ట్రంలోని పలువురు పార్లమెంటు సభ్యుల పార్టీ ఫిరాయింపులతో లోక్‌సభలో ప్రతిపక్షస్థానం ఇందిరా కాంగ్రెస్‌వర్గంనుంచి జారిపోయినట్టే, రాష్ట్ర పాలక పక్షంలోను అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడుతుందని పలువురు భావిస్తున్నారు. శ్రీ కె. వి. కేశవులును రాష్ట్ర ఇం. కాం. లెజిస్లేచర్ పార్టీ నుంచి బహిష్కరించారు. శ్రీనివాసులురెడ్డిని కూడ బహిష్కరించారు. పలువురికి, దాదాపు కొన్నివందల మందికి సంజాయిషీ నోటీసులు ఇవ్వడానికి చర్యలు జరుగుతున్నాయి. పార్టీనుంచి బహిష్కరింపు తీసుకున్న చర్య తనకేమీ ఆశ్చర్యం కలిగించలేదని శ్రీ కేశవులు అన్నారు. రాష్ట్ర కాంగ్రెస్‌వాదులను బెంగుళూరు సదస్సు బాగా ఉత్తేజపరచిందని కొందరంటే, దాని ప్రభావం ఇం. కాం. వర్గంపై ఏమీ పడదని కొందరంటున్నారు. శ్రీ జలగం వెంగళరావు మొదటినుండి కాంగ్రెస్ సమైక్యాన్నే కోరుతున్నారు గనుక పలువురు శాసనసభ్యులతో బెంగళూరు సదస్సులో పాల్గొన్నారు. శ్రీ వెంగళరావు చూపిన ధైర్యసాహసాలు, ప్రత్యర్థులకు కనువిప్పు చేశాయి. ఆయన మరొకమారు వెలుగు పెరిగినా ఆశ్చర్యంలేదని కొందరంటున్నారు. రాష్ట్రంలోని పార్లమెంటు సభ్యులలో కొందరు ఇం. కాం. లో ఇదివరకే వున్నారు. వారిలో హరిజన సభ్యులు తులసిరామ్, భీష్మదేవ్ శ్రీ జలగం నాయకత్వంలోని కాంగ్రెస్‌కు మరలి మారరు. హరిజనోద్ధరణకు ఇం. కాం. కంకణం కట్టుకొన్న ఏకైక సంస్థ అని ప్రచారం పొందుతున్న సమయంలో వీరిద్దరూ మళ్లీ కాంగ్రెస్ లోకి రావడం హరిజనులకే ఆశ్చర్యం కలిగింది.

**పిల్లి శాపాలు :**

పిల్లిశాపాలకు ఉట్లు తెగుతాయా ? అని సామెత. పిల్లి ఉట్టికిందికి వెళ్లి ఉట్లు తెగిపోవాలి, పాలకుండ, పెరుగుకుండ కిందపడాలి. నా కడుపునిండాలి- అని అనుకొందట. ఉట్లు తెగుతాయా ? కుండలు కింద పడుతాయా ? ఈసామెత జ్ఞాపకం వచ్చింది. కాంగ్రెస్ నాయకుడు చంద్రజిత్‌యాదవ్ జూన్ 29 న తెలిపిన భావాలు విని, ఇందిరా కాంగ్రెస్ పార్టీ



బ్రిటిష్ విదేశాంగ కామన్వెల్త్ వ్యవహారాల మంత్రి శ్రీ లార్డ్ కారింగ్టన్ జులై 2 వ తేదీన ఢిల్లీ వచ్చినప్పుడు విదేశ వ్యవహారాల మంత్రి శ్రీ ఎ. బి. వాజ్‌పేయి విమానాశ్రయంలో ఆయనకు స్వాగతంచెప్పారు. ఈ యిద్దరూ, ఉభయదేశాల విధానాలపై కీలకమైన చర్చలు జరిపారు.

## హైదరాబాద్ నోట్ బుక్

ముక్కలయి, డాక్టర్ చెన్నారెడ్డి ప్రభుత్వం రెండు నెలలలో పడిపోతుందని ఆయన జోస్యం చెప్పారు. జనతాపార్టీలో జరిగే ముసుగులో గుద్దులాట బట్టబయలయి, అనుకొన్నదానికన్నా ముందుగానే ముక్కలయి పడిపోతుందని ఆయన ఉవ్విళ్ళూరుతున్నారు. పాపం! అగడ్తలో పడిన పిల్లికి అదే వైకుంఠం!

**ఉపశ్రుతి :**

తాతయ్యగారూ, తాతయ్యగారూ, 'నాకో తములపాకు ఇవ్వరూ! అని అడిగింది నాలుగేళ్ల పాప లక్ష్మీప్రగడ అపర్ణ, తాంబూల చర్వణం చేస్తున్న నామిత్రుణ్ణి. నాకొక ముద్దు ఇస్తే ఇస్తాను అన్నాడు నా మిత్రుడు ఆ పాపతో. ముద్దిచ్చి, విడెము తీసుకొని నవ్వుతూ వెళ్లింది పాప. ఇంతలో నామిత్రుని భార్య అపర్ణతో పాపా, తాతయ్యగారినడిగి రెండు తములపాకుల బీడాలు తెచ్చి పెట్టవూ? అని అడిగింది లోపలి నుంచి. బామ్మగారూ! ముద్దిస్తేగాని తాతయ్యగారు తములపాకు లివ్వరుట అంది. అరవైయేళ్ల బామ్మ ముఖం అరవిచ్చిన పత్తికాయ అయింది.

— తిరుమల రామచంద్ర





జూన్ 10వ గుంటూరులో కిరిజవ సెమినార్‌లో శ్రీ 'తులసీరాం' కార్టూన్ల వర్ణ చిత్రాల ప్రదర్శన జరిగింది. కార్టూనిస్ట్‌ని శ్రీ ఎస్. బి. ఫ్రాంక్లిన్ సన్మానిస్తున్న దృశ్యం.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.